



మాతృదేవత

చిత్రకారుడు శ్రీ వై. నాగేశ్వరరావు

# గృహలక్ష్మి

## దసరా - దీపావళి సంచిక

దసరా ఉత్సవాలు, దీపావళి పర్వదినము రెండూ అక్టోబరు నెలలోనే వస్తున్న సందర్భమున మా 'గృహలక్ష్మి' అక్టోబరు సంచిక ప్రత్యేక సంచికగా వెలువడ నుద్దేశించబడింది.

ఎక్కువ పేజీలతోటి, కథానికలు, నాటికలు, గేయాలు, అమూల్యమైన వ్యాసాలుకలిగి ఆకర్షణీయంగా వెలువడగలదు. రచయితలు తమ అమూల్యమైన రచనలుపంపి మాకృషికి సహాయపడగలరని మా విజ్ఞప్తి.

సంపాదకుడు




### సాలుచందా మొదలగునవి

ఈ సచిత్రమాసపత్రిక సాలుచందా రు.4-8-0. అర్థసంవత్సరపు చందా రు.2-8-0. అంతకు తక్కువ కాలపరిమితి చందా పద్ధతిలేదు. విడికాపి ఆరు అణాలు. చందాదారులు ఏమాసమునుండియైన ప్రారంభము చేయవచ్చును. విడికాపీలు వలయువారు వాని విలువమేరకు తపాలాబిళ్లలు పంపవలయును. వీ. పీ. పద్ధతి వ్యయమూలకము. బర్మాకు రేట్లు ప్రత్యేకము.

### ప్రకటనలు

ముఖ్యముగా స్త్రీలకందీయవలసిన వస్తువులనుగూర్చి ప్రకటించుటకీపత్రిక ఎంతయు అనువైనది. ప్రకటన చార్జీలు ప్రతిమాసము ముందుగానే చెల్లింపవలయును. కాలుపుటకు తక్కువయైన ప్రకటనలు చేకొనజాలము. రేట్లకొఱకు వ్రాయునది.

### వ్యాసములు వ్రాయువారికి

వ్యాసముల ముఖ్యాశయము స్త్రీజనాభ్యుదయమైయుండవలెను. అవి సంగ్రహముగ నున్న శీఘ్రప్రచురణకు వీలగును. ఒకేప్రక్క సిరాలో స్పష్టముగ తప్పులులేక వ్రాయవలెను. భాష గ్రాంధికముగాని, వ్యావహారికముగాని కావచ్చును; రెండును కలిపి వ్రాసిన అంగీకరింపబడవు. వ్యాసముల ప్రకటించుటలో సంపాదకులకు సర్వహక్కులు గలవు. ప్రకటింప నంగీకరింపబడినపుడు మాత్రము రచయితల కట్లు తెలుపబడును. విమర్శనార్థము పంపు గ్రంథములు రెండుప్రతులు పంపవలెను. రిప్లైకార్డు వ్రాసిననే బదులివ్వబడును.

### సంచికలు చేరనిచో

సంచికలు చేరనిచో ఆయామాసములందు వెంటనే మాకు తెలుపవలయును. చిరునామామార్పును తెలుపకుండుటచే కాపీలు చేరనివారికి తిరుగ పంపజాలము. సంచికలు చేరనివారు తమతమ పోస్టాఫీసులలో కంప్లైంటును చేయునది.

### చిరునామా మార్పు

చిరునామాయందు మార్పుఉండుచో ముందుగానే తెలుపవలయును. ఇట్లు తెలుపనిచో కాపీలు తిరుగ పంపజాలము.

### ముఖ్యమైన గమనింపు

చందాదారులుగ చేర్చుకొనుమని వ్రాయు ఉత్తరములు, ఇతరమైన ఉత్తరములు మానేజరు, గృహలక్ష్మి, రాయపేట, మదరాసు అను చిరునామాకే వ్రాయవలయును. చెక్కులు,మనియార్డర్లు, పోస్టలు ఆర్డర్లు 'కేసరికుటీరం లిమిటెడ్' పేర పంపవలెను.

చెక్కులు మద్రాసు బ్యాంకులపైననే పంపవలెను.

# గృహలక్ష్మి

స్త్రీల ఆరోగ్యసౌభాగ్యములను సంపాదించుట
కేర్పడిన సచిత్ర మాస పత్త్రిక


వ్యవస్థాపకులు

డాక్టరు. కే. యన్. కేసరి

ఆక్టింగ్ ఎడిటర్

సి. సి. పున్నయ్య



సంపుటము ౨౩]  సెప్టెంబరు 1954  [సంచిక ౯

# విషయసూచిక






జయజయ గృహలక్ష్మి సఖి! జయజయ లలితాంధ్ర! మధుర సారస్వతమా!
జయజయ లలనా రత్నమ! జయజయ విద్యాప్రబోధ! జయకల్యాణీ!



## ఆంధ్రకేసరికి జోహార్లు!

ఎనభై ఆరు సంవత్సరాలు నిండిన జాతీయవీరుడు - నాయకుడు. ఆయన ధైర్య స్థైర్యాలు, శక్తిసామర్థ్యాలు, ఆస్తిపాస్తులు సర్వస్వము ప్రజలకంకితముచేసి వారి అభ్యుదయ పురోభివృద్ధులను కనులారగాంచి సంతోషించ నుబలాటపడుతున్న స్వార్థ త్యాగి. ప్రజలే తను, తనే ప్రజలని బాహాటంగా చాటుతూ ప్రజాసేవలో నిమగ్నుడై యుండే కార్యవాది. కాబట్టే ఆంధ్రప్రజానీకానికి ఏకైక నాయకుడుగా శ్రీప్రకాశం గారు యీనాడూ ఆనాడూ చలామణి యగుట తటస్థించింది.

నాయక శ్రేణికి చెందిన వారనేకులున్నారు; కాని ప్రజాహృదయాలను శ్రీప్రకాశంగారు ప్రత్యేకంగా హరించడానికి కులమత వర్గ పక్షపాతం లేకపోవడం గులాబి పుష్పానికి వాసనలాంటిది.

అంతమాత్రంచేత లోటుపాట్లులేని మానవాతీతుడు కాకపోవచ్చును; మిత భాషి కావచ్చును; రాజకీయచతురత లోపంవలన మొండిపట్టువాడని కొందరనవచ్చును;

అదే ఒక్కొక్కప్పుడు నిరంకుశంగా కనుపించవచ్చును. కాని అందులో ఏదీ తన స్వార్థానికని ఉద్దేశించినది కాదు; ప్రజాహితాన్ని, జాతీయశ్రేయస్సును దృష్టిలో నుంచుకొని ముందుకు నడుస్తున్నప్పుడు వాటిని గోరంతలు కొండంతలుగా చేసి మహానాయకుని వెనక్కులాగడం వివేకమా? ఆయనను అనుసరించి నడుస్తూ, లోటుపాట్లను నచ్చచెప్పి జాతీయనిర్మాణ కార్యకలాపాలలో సహకరిస్తూ ఆయనతోపాటు ముందంజ వేయడం హర్షనీయము కాగలదు.

ఆయన జన్మదినోత్సవ సందర్భమున అఖిల ప్రజానీకంతోబాటు ఆంధ్ర కేసరికి మా జోహారులర్పిస్తూ వారికి భగవంతుడు ఆయురారోగ్యాలను ప్రసాదించి వారి నాయకత్వముక్రింద దేశము సర్వతోముఖాభివృద్ధి చెందవలెనని కోరుతున్నాము.

# ప్రజాసంస్థల నిర్వాహణలోకల బాధ్యతలు

మంత్రిపదవులవంటి బాధ్యతలను నిర్వహించే వ్యక్తులు ప్రజాస్వామ్య సంస్థలను నడపడంలో తమ సహజధోరణులలో వ్యవహరించకుండా ఎంతో సౌజన్యముతో యిచ్చి పుచ్చుకునే తత్వంలో ప్రవర్తించవలసి యుంటుందనే విషయాన్ని నిరంతరము గుర్తుంచుకోవాలనే అభిప్రాయాన్ని కాంగ్రెస్ అధ్యక్షుడు, భారత ప్రధాని పండిత నెహ్రూ వ్యక్తం చేశారు.

ప్రజాసంస్థల నిర్వహణలోకల బాధ్యతలు చాలగురుతరమైనవి. వానిని గుర్తించి పదవులలోని వ్యక్తులు వ్యవహరించిననాడు సంస్థల ఆదర్శ లక్ష్యాల సిద్ధితో సర్వతో ముఖమైన అభివృద్ధికి అవకాశములు విస్తృతంకాగలవు.

ఇట్టి బాధ్యతలను మంత్రిపదవులవంటి బాధ్యతలను నిర్వహించే ప్రజాస్వామ్య సంస్థల-జిల్లాబోర్డులు, పంచాయతి బోర్డులు, మునిసిపాలిటీలు, సహకార సంఘాలు, ప్రజాసంస్థలులాంటివాని నిర్వాహక వర్గం గుర్తించి జన సామాన్యపు జీవితమార్గాన్ని తీర్చి దిద్దుకోడానికి నలుముఖాల సౌజన్యముతో సహకరించాలి.

కాని యీ నాటి పరిస్థితులు అవికావు. అవిద్య, విజ్ఞానలేమిచే అధిక సంఖ్యాకులగు ప్రజలు యుక్తాయుక్తములు తెలిసికొనకలుగు స్థితిలో లేరు. దాని నవకాశంగా తీసికొని ఏదోవిధంగా ఎన్నుకోబడి పదవులలోకి వచ్చినవారు స్వార్థపరులై బాధ్యతా

(450 పేజీ చూడుడు)

# కావ్యాలలో కలహంసల ప్రశస్తి

శ్రీ దాసరి వేంకట కృష్ణయ్య




కలహంస అంటే రాజహంస అని అర్థము. ఎక్కువగా మన తెలుగుకవులు తమ కావ్యములలో ఈ హంసల ప్రశస్తిని తీసుకురాకుండా వుండలేదు. కాళిదాసు తన "మేఘసందేశము"లో—

"యత్రోన్మత్త భ్రమరముఖరాః
పాదపా నిత్యపుష్పా
హంసశ్రేణీ రచితరశనా
నిత్యపద్మా నలిన్యః
కేకోత్కంఠా భవన శిఖినో
నిత్య భాస్వత్కలాపా
నిత్యజ్యోత్స్నాః ప్రతిహతతమో
వృత్తిరమ్యాః ప్రదోషాః"

అలకాపురి అందచందాల్ని గూర్చి కవికులతిలకుడు కాళిదాసు కల్పన చేస్తున్నాడు. ఆ పట్టణములో చెట్లు నిత్యపుష్పితములై తుమ్మెదల ఝుంకారముతో అందముగా వుంటాయట. తామరతూళ్లు నిత్య పద్మములై గుండ్రముగా హంసల వరుసను వడ్డాణంగా కలిగివుంటాయట. పెంపుడు నెమళ్లు నిత్యమూ పురివిప్పిఆడుతూ, ఎలుగెత్తిపాడుతూ వుంటాయట. ఇంక రాత్రులేమో నిత్యజ్యోత్స్నలై చీకటి తెరలను మటుమాయంచేసి అందాన్ని చిందుతూ వుంటాయట! తామరకొలనులో చుట్టూ ముసురుకొన్న హంసల వరుసలో కాళిదాసుకు ఒడ్డాణపు టొయ్యారం కనిపించింది!

కాళిదాసుని 'విక్రమోర్వశీయములో' కూడ హంస ప్రశస్తి వస్తుంది.

పురూరవ చక్రవర్తి పిచ్చివాడయి అరణ్యములో ఇదిగో ఊర్వశి అదిగో ఊర్వశియని అహోరాత్రము తన ప్రియురాలిని వెదకుచు మానస సరస్సునందుగల మరాళమును ప్రియురాలి వృత్తాంతమునెట్లా అడిగాడో వినండి.

"తెలివ నడలు నీకెవరు నేరిపిరి తెలుపుము రాజమరాళా!
యెఱిగింపుము నీకింతిజాచితే నేహర్షింతును జాల."

అని హంసకు అంజలి పట్టాడు.

నైషధం విద్వదౌషధం అని పేరుబడ్డ "శృంగార నైషధము"లోకూడ శ్రీనాథుడు హంసల్ని తీసుకు వచ్చాడు.

నలదమయంతుల ప్రణయానికి పాదుపెట్టిన కారణంగా హంసకు లభించిన గౌరవం చాలా గొప్పది. దూత్యంలో కలహంస ప్రదర్శించిన మాటల నేర్పు కూడ అపూర్వమైనదే! దమయంతి ముందల హంస తన అభిజాత్యాన్ని కూడ అభివర్ణించుకుంది.

"నలిన సంభవు సాహిణము వారువంబులు
కులముసాములు మాకు గువలయాక్షి,
చదలేటి బంగారు జలరుహంబుల తూండ్లు
భోజనంబులు మాకు బువ్వుబోణి,
సత్యలోకముదాక సకలలోకంబులు

నాటపట్టులు మాకు నబ్జవదన,
మధురాక్షరంబులు మా మాటలు
వినంగ
నమృతాంధసులె యోగ్యు లనుప
మాంగి,
భారతీదేవి ముంజేతి పలుకు జిలుక
సమదగజయాన సబ్రహ్మచారి మాకు,
వేదశాస్త్రపురాణాది విద్యలెల్ల
తరుణి నీయాన ఘంటా పదంబు
మాకు.''

కనుక హంస దమయంతికంటే చాలాగాను తెక్కువే చదివిందన్నమాట. అంతేకాదు - ఆ హంస రెక్కల కొనలలో బంగారంకూడ వున్నదట. నలుడు తనను పట్టుకొన్నప్పుడు—

''రెక్కల కొనలం గలిగిన
ఇక్కాంచన మాసపడియెదెన్నృప! నీకే
యక్కట దీనం దీఱెదు
నక్కట నీహారలేశ మబ్ధికిపోలెన్.''

అంటూ నలమహారాజుని బ్రతిమాలుతున్నప్పుడు కూడ తన రెక్కల బంగారపుటంచులను గురించి మరచిపోలేదు కలహంస! నలుడు హంసతో—

''నెలనెల దప్పక యుండగ
నెల భాస్కరు జొచ్చుటెల్ల నియమము
తోడం
కలహంస వేడి వెన్నెల
సొలయక నాయంగకములు సూడుటకు
జుమీ.''

ప్రతి యమావాశ్యయందును సూర్య చంద్రులు ఏకరాశిగతులై యుందురు. భూమినుంచి సూర్యనికి సూత్రమువేసినచో దానికి చంద్రుడు తగిలియుండగులక యుండును. తగిలినచో సూర్యగ్రహణ మగును. ఈయేకరాశ్యైక సూత్ర గతత్వమునే సూర్యునియందు చంద్రుడు చొచ్చుటయని కవులు వ్యవహరింతురు - చంద్రిక ఉద్దీపన విభావముగాన నలుడు వానికి తాళలేకున్నాడు.

హంస దమయంతివద్దకుపోయి దౌత్యము నిర్వహించి, తిరిగి నలుని దగ్గరకు వచ్చినపుడు హంసని ఎట్లా మెచ్చుకొన్నాడో వినండి.

''సరసత్వంబు నిగూఢ కార్యఘటనా
చాతుర్య సంపత్తియుం
బురుషార్థైక పరాయణత్వమును నభ్య
స్తాన లీలాధురం
దరతా ప్రౌఢియునుం గృతజ్ఞతయు
వాత్సల్యంబు సద్భావమున్
సరసీజాసన వాహనాన్వయవతంసా
హంస; నీ కందముల్.''

హంస అంత సుందరమైనది కనుకనే.

''వరుణ రాజునకిడిన చామరమువోలె
పొడవు మిగిలిన పొందమ్మి పూవువోలె
నిబిడ నిద్రాభి ముద్రిత నేత్రమైన
రాజహంస ... ... ... ... ''

అంటూ శ్రీనాథుడు ప్రశంశించాడు.

''హరివంశం''లోకూడ ఎఱ్ఱాప్రెగ్గడ ప్రాతఃకాలాన్ని వర్ణిస్తూ—

''పాడె మధువ్రతావళులు పద్మవనీ
విభవంబు శాపమున్
వీడె రథాంగకములకు వేడుకగూడి
తరంగడోలలం
దాటె మరాళదంపతులు హాసవిలా
సము దక్షిణ గ్రక్కునన్

వాడె కుముద్వతీ ముఖము వావిరిసూడె
తమోనిబంధముల్."

అంటూ తెల్లవారుఝామున హంసల జంటను తరంగ డోలికలలో ఉయ్యాల లూగించాడు.

హంసలు అంతఃపురాలలోను అతివల ఆట పాటలలో పంతులాడిన ఘట్టాలు కనిపిస్తాయి. నంది తిమ్మనగారి "పారిజాతాపహరణం"లో శ్రీకృష్ణుడు సత్యామందిరం ప్రవేశిస్తూ.

"... ... కరతాళగతుల మందిర
మయూరంబుల
నాడింప రేలకో యతివ లిపుడు
కలికి రాయంచ బోదల నల్ల నెలయించి
నడిపింప రేలకో పడతులిపుడు ..."

అనుకుంటాడు-అంతేకాదు. తిమ్మనగారు మరొక విషయంకూడ తేటపరచారు. అంతఃపురములోని హంసలు అంగనల అందెల ధ్వనిని అనుసరించి నడుస్తాయట. అలుకదీరిన సత్యభామ 'జలకమాడి తరలి వస్తున్న ఘట్టంలో—

"జలకంబాడి మడుంగు గట్టి మణి
భూషాదీప్యమానాంగి యై
కలపం బెంతయు వింతగానలది చెంగ
ల్వల్ నెతిన్ మించ వే
వలి గీల్కొల్పి పసిండి యందెరవళిన్
రాయంచలంతంత రా
జెలులుం దానును సత్యభామ సను
దెంచెన్ నాథుడున్పొంగగన్."

సత్యభామ స్వర్ణనూపురధ్వని విని రాజహంసలామెను అల్లనల్లన అనుసరిస్తున్నాయట!

తెల్లని రెక్కలు, ఎఱ్ఱని పాదాలు, మానస సరస్సులో మనుగడ, తామరకాడలు ఆహారం - ఇన్నింటికితోడు పాలను, నీటిని వేరుచేసి పాలు మాత్రం స్వీకరించే నేర్పుకూడ హంసలకువుంది. ఏనుగు లక్ష్మణకవి తెనిగించిన "భర్తృహరి సుభాషితం"లో—

"వనజభవుండు కోపమున వాహన
మైన మరాళభర్తకున్
వనజవనీ విహారకలనంబు తొలంగగ
జేయుగాని గుం
భనమునదుగ్ధజీవన విభాగ విధాన
నిరూఢ నైపుణీ
జనిత మహాయశో విభవసారము
హంసకు మాన్పజాలునే."

బ్రహ్మకు వాహనము హంస. అట్టి హంసపై కోపమువస్తే పద్మ సరస్సులో విహరించే అవకాశం లేకుండా చేయగలడటకాని, పాలను, నీటిని వేఱు చేయగల నైపుణ్యంవలన వచ్చిన కీర్తిని మాత్రం తొలగించలేడట.

బమ్మెర పోతనామాత్యుడుకూడ తన "భాగవతము"లో హంసల ప్రశస్తి లేకుండా వుండలేదు.

"నిర్మల మందాకినీ వీచికల దోగు
రాయంచ చనునే తరంగిణులకు"

అంటూ గంగా తరంగాలలో ఆటలాడిస్తే.

"లలి మానసంబున్న మెలగెడు హంసకు
వెలయు పల్వలముపై వేడ్కగలదె."

అని మల్లికార్జునభట్టు మానస సరోవరంలో కాపురం కట్టబెట్టాడు.

పింగళి సూరనగారి "ప్రభావతీ ప్రద్యుమ్నము"లోకూడ 'శుచిముఖి' అనే పేరుగల హంసను ప్రవేశపెట్టాడు. ఈ హంస ప్రభావతీ ప్రద్యుమ్నులకు దౌత్యము సలుప నిశ్చయించుకొన్నది. వజ్రనాభుని సంహారమునకును, సురరాజా యభీష్టసిద్ధికిని తన చతురతను వినియోగించింది. దేవేంద్రుడా హంస విద్యా నిపుణతకు పొగిడి చివరికి హంసతో—

"నీ వెవ్వరి కొలదియు గా
వో వరటామణి విహంగ పోప వె భాషా

ప్రావీణ్యము చూడగ్గ వా
గ్దేవతవో కాక యాకెదిద్దిన కవివో."

అని స్తుతించినాడు. నిజమే! ఇట్టి భాషా ప్రావీణ్యము, ఇట్టి చతురతలేని హంస మన సూరన గారికి పనికిరాదు.

బ్రహ్మకును వాణికిని పాలయలుక దీర్చినది హంసయే.

శ్రీకృష్ణదేవరాయలి "ఆముక్తమాల్యద"లో–

"ద్రవిడ కుటుంబినుల్ వసపుడాచిన
రత్నపుదాపక్రింద నం
బువుదెరవారగా నిదురవోయి గరు
త్తతి పచ్చబాఱినన్
భవన సరోమరాళములు భర్మమయ
చ్ఛద గుచ్ఛ విస్ఫుర
ద్దివిజ ధునీ మరాళ వితతిభ్రమ
బూన్చు బురిన్భ్రమించుచున్."

ద్రావిడ స్త్రీలు గృహముల వెనుకనుండెడి కొలనులలో పసుపాడి స్నానముచేయునపుడు రత్న సోపానముక్రింద హంసలు నిద్రబోవుచుండగా ఆ పసుపునీరు రెక్కల కంటుకొని పచ్చబడి–బంగారు రెక్కలుగల స్వర్గమందలి హంసలని చూపఱులను భ్రమింపజేసినవని భావము.

వర్షాకాలము హంసలకు సరిపడదు. అందుకని క్రౌంచనగ గుహామార్గమును ఆధారముజేసికొని మానస సరోవరమున కేగునని చెప్పుదురు. అందుచేత వర్ష ఋతువు హంసలకు వినాశనకరము. అందుకనే అల్లసాని పెద్దనామాత్యుడు "మనుచరిత్ర"లో.

"వనజేక్షణా మనోధన పశ్యతో హరుం
డరిహంస సంసదభ్రాగమంబు"

అని అన్నాడు. "మనుచరిత్ర"లోనే మరోచోట–

"ఇనుడప్పుడజుడౌట మునుమున్న పడి
వాగె
కొనివచ్చు రాయంచ కోదమయనగ"

సూర్యుడు, ఉదయమున బ్రహ్మ, మధ్యాహ్నమున రుద్రుడు, అస్తమానమున విష్ణువునగునని చెప్పబడును. ఆ ప్రకారము ఉదయమందు సూర్యుడు బ్రహ్మయగుటచే ముందు ముందుగా ఎక్కుటకు సిద్ధపఱుపబడినతీరున ఎదటికి తీసికొనివచ్చుచున్న చిఱుత ప్రాయంపు రాజహంసవలెవుంది అని వరూధినిని పెద్దనగారు వర్ణించారు.

బాణమహాకవి రచించిన "హర్ష చరిత్ర"లోని వాత్స్యాయన వంశవర్ణనములో–

సరస్వతి దూర్వాసునిచే శపించబడి భూలోకమునకు పంపబడినది. ఒకరోజు సరస్వతికి హంసధ్వని యిట్లా వినవచ్చింది.

"మానససరో నివాసంబు మాని దిగుడు
బావిలోపల వసియింప వచ్చెనను చు
బొగిలెదేటికే రాయంచ పువ్వుబోడి!
మరల జేరెదవా! 'సరోవరముదరికి,"

హంస పలికిన పద్యములో రెండు భావములున్నవి. ఒకటి హంస జాతికి సంబంధించినది. రెండు సరస్వతికి సంబంధించినది. హంసకు నివాసము మానస సరోవరము. దిగుడు బావిమటుకు కాదు. దిగుడు బావి కొద్దిది. మానస విశేషములు దానిలో నుండవు. ఓ రాజహంసా! బావిలో నివసింపవలసివచ్చెనని ఏల ఖేదపడెదవు. నీవు మరికొంతకాలమునకు మరల మానస సరోవరముననే సంచరింపగలవు. చింతవలదని హంస హంసిని ఓదార్చుట. ఇక అంతరార్థము- ఓ సరస్వతీ! బ్రహ్మలోక నివాసముమాని భూలోకమున నివసింపవలసి వచ్చెనని ఖేదపడుచున్నావు. నీకట్టి ఖేదమువలదు. కాలాంతరములో బ్రహ్మలోకములో మరల నివశింతువు. బ్రహ్మలోకము మానస సరోవరముతోనూ, భూలోకము దిగుడుబావితోనూ, సరస్వతి హంసివంటిదనియు వ్యంగ్యముగా గోచరించును.

ఈ విధముగా కావ్యాలలో హంసల ప్రశస్తి మనకు కనిపిస్తూవుంటుంది.

(బెజవాడ ఆలిండియా రేడియోవారి సౌజన్యముతో)

# పవనసందేశము

శ్రీమతి గంటి కృష్ణవేణమ్మ

———

శ్రీ రాజిల్లెడి ద్వారకాపురమునన్ జెల్వొంద నేవేళలన్
గారాబంబున రుక్మిణీసహితుఁడై కల్యాణసంధాయియై
కారుణ్యంబున నెల్ల భక్తజనులం గాపాడు దేవుండు రా
ధా రామా రమణుండు మాకెపుడు సంధానించు నైశ్వర్యముల్.

చల్లని కాంతులు భువి వెద-చల్లుచు నమృతార్ద్ర కిరణ జాలముచే న
ల్లల్లఁ గలువలచెలి నిశా-వల్లభుఁ డుదయించెఁ గనులపండువుగాఁగన్.

అలయింపు చువిరహిణులను-గలఁగింపుచు జార చోర కాండము వలపుం
గిలిగింత లిడుచు కువలయ-లలితాంగికి శీతరుచి విలాసము చూపెన్.

నందనారామ మందార నవ సుమముల-పరిమళము గొంచు దక్షిణాపథము నుండి
యల్లనల్లన నరుదెంచెఁ బిల్లగాలి-విరహిణీజన హృద్వ్యథా బీజమగుచు.

భామ యొక్కతె విర్వేద భరమహాగ్ని-గనలి సైపక నిట్టూర్పు గాడ్పు లెగయ
నల్లనల్లన బృందావనాంతరమునఁ-దిరిగె నున్మత్తయై దారి తెన్నునాక.

లాలిత పవనా హతిచేఁ-దూలుచు నెయ్యదియు మదికిఁ దోఁపక యాలో
నాలోకించె దిశావలి-నాలోల విశాలనేత్ర యతి దీనగతిన్.

మందపవనుడు మెయి సోక నిందువదన-గుండెబరువున సతతంబు కుమిలి కుమిలి
యులికిపడి కేలుగవ మోడ్చి యో మహాత్మ-పవన రక్షింపు వేగింప వలదటంచు

బలయుతుఁడవు దుర్బలులను-నలయించుట ఘనతయా నె యార్తశరణ్యా
సులలిత హృదయా! పవనా-యలయించకు కేలు మోడ్చి ప్రార్థింతు నినున్.

అల్పుఁడైన వాని నర్థించి మదిన భీ-ష్టంబు గనుటకంటె సకలవిధుల
గొప్పవారి వేఁడి కోరిక లీడేర-కున్న దాననేమి కొదువగాదు.

నీవే ప్రాణాధారము-నీవే భువనత్రయమ్ము నేర్తువు దిరుగన్
నీవే సర్వాత్మకుడవు-నీవు జారని చోటులేదు నిఖిలావనిలో.

విసరుదువు కొండలైనను-మసలుదు వెందైన స్వేచ్ఛ మలయానిలమో
యసమాన ధీవిశాలా:-యిసుమంత సహాయమిచ్చు దీవు సలుపుమిా,

మఱవను నీ యుపకారము-చిరతరమై నీదుకీర్తి చెలఁగెడిధరలో
పర కార్య సక్త ధీపథ:-కరువలి యంజలి యొనర్తు కదలుమధురకున్.

కను మూసి తెఱచులోపలఁ-జన నేర్తువు యోజనములు జవమేపారన్
నినుబోయి వారలెవ్వా-రనపా! దవ్వెంత; మధుర కరుగుము వేగన్.

చల్లనివాఁడవు పవనా-యల్లన జను కృష్ణుఁడున్న హర్మ్యంబునకున్,
నుల్లము గరుఁగఁగ నావిధ-మెల్లఁ దెలిపి తోడితెత్తె యాడకువడిగా.

మిన్నంటెడి సౌధంబులు-కన్నులు మిరుమిట్లు గొలుపు కాంతామణులున్
ఎన్నగ మధురా పట్టణ-మన్నా! వర్ణించి చెప్ప నవునేనాచే

(సశేషము)

---

(444 పేజీ తరువాయి)

రహితంగా వ్యవహరించుట సహజమయింది. దానిఫలితమే యీ నాటి ప్రజాసంస్థల నిర్వహణలోని అవకతవకలు, లంచగొండితనము, దోపిడివిధానమున్నూ. ముఖ్యంగా సహకార ఉద్యమ ఆదర్శలక్ష్యాలు మహోపయుక్తమయినవయినా వీనివలన సహకార సంఘాలుమాత్రం తృప్తికరంగా ప్రజాహితానికి తోడ్పడజాలకున్నవి.

ప్రజాసంస్థల నిర్వాహక వర్గమునకు ఎన్నుకోబడేవారు, ఎన్నుకునేవారూకూడ తమ తమ బాధ్యతలను, హక్కులను, అవకాశముల నర్థముచేసికొని వ్యవహరించిన నాడే పండిత నెహ్రూ చెప్పినట్లు సౌజన్యముతో యిచ్చిపుచ్చుకునే తత్వం అమలులోనికి రాగలదు. ప్రజలలో సమరసస్నైక్యతల సాధనకిది మార్గదర్శకమై అభ్యుదయ పరంపరల కవకాశము లేర్పడును.



# శ్రీమతి గంటి కృష్ణవేణమ్మగారి

# శ్రీ జ్ఞాన ప్రసూనాంబికా శతకము



పండిత వేదం వేంకటకృష్ణశర్మగారు

(గతసంచిక తరువాయి)

"నీవే తల్లివి దండ్రివి నీవేనా తోడు
నీడ"—

అనే కృష్ణశతక పద్యభావాన్ని పుడికి పుచ్చుకొన్నది యీ దిగువ పద్యం:—

"నీవే తల్లివి, తండ్రి నీవె గురుఁడు,
నన్నీవే, మనోదైవముఁ,
నీవేసంతతి, నీవె బంధుజనము,
నన్నీవే సఖీరత్నముఁ
నీవే నాపతి, నాదు మేలిగతియు
నన్నీవేకదా, శాంకరీ"

"తన వారు లేని చోటను జనవిం
చుక లేనిచోట జగడము చోటఁ"

అనే సుమతిశతక ధోరణికి ఇది ప్రతిక:—

"తులువల్ గూడిన చోటికిఁ బరులు
దఁ దూషించునచ్చోటికిఁ
బిలువంబంపని చోటికి న్నెవరు దఁ
ద్రేమింపనచ్చోటికిఁ
బలవద్వైరులు గల్గు చోటికిని బో
వం జెల్ల దెప్పట్టునఁ,"

వేణుగోపాల శతకంలోని:—

"వాగ్భూషణంబు నివ్వర్ణనసేయుట,
కర్ణభూషణము నీ కథలువినుట,
హస్తభూషణము నీ కర్చనసేయుట
నేత్రభూషణము నీనటుగనుట"

అనే పద్యచ్ఛాయ గలది:—

"నినుఁబూజించుటహస్తభూషణములౌ
నిత్యంబు నిఁ బారుకే
ఘనరత్నాంచితతారహారములు నీ
గాథాసమాకర్ణనం
బన, తాటంకమణిద్వయమ్ము భవదీ
యానంద దివ్యాలయాం
గణము న్మెట్టులె పాదభూషలుగదా"

పూర్వ కవీంద్రుడు ఎవడో చెప్పిన యీ క్రింది పద్యానికికూడా అనుకరణ మొకటి ఈ శతకంలో కనబడుతూన్నది. ఆ చాటువు ఉత్పలంలో చెప్పబడ్డది:—

"మాటలచేత దేవతలు
మన్నన చేసి వరంబు లిత్తు, రా

మాటలచేత భూపతులు
మన్ననచేసి పురంబులిత్తు, రా
మాటలచేతఁ గామినులు
మన్ననచేసి సుఖంబులిత్తురా,
మాటలు నేర్వకున్న నవ
మానము న్యూనము మానభంగ
మున్''

దీన్ని పోలిన యీ శతకంలోని మత్తేభం చూడండి:—

"నయవాక్యంబులఁ దృప్తులై వరముల
న్నాకాధిపుల్గూర్తు, రా
నయవాక్యంబుల కుబ్బుచున్ ప్రియము
భూనాథోత్తము ల్గూర్తు రా
నయవాక్యంబులఁ బ్రీతులై సుఖముల
న్నారీమణు ల్గూర్తు, రా
నయవాక్యంబుల మూర్ఖుఁడెట్లువలుకున్
జ్ఞానప్రసూనాంబికా''

''ధనుఃపౌష్పం, మౌర్వీమధుకరమ
యీ, పంచవిశిఖాః''

అనే సౌందర్యలహరిలో శ్లోకానికి:—

"జననీ! యిక్షువు చాపదండము ధను
ర్జ్యావల్లి భృంగాళి, స్యం
దనరాజంబగు మందమారుతము చే
త న్నైదుపూములు ల
య్యును లోకంబుల గెల్చు నీకరుణఁ బ్ర
ద్యుమ్నుం డనంగుండు''

భావమంతా సౌందర్యలహరి శ్లోకాను సరణమే అయినా, చాపాన్నిమాత్రం కవయిత్రి ''యిక్షువు'' అన్నది. మూలంలో అది "పౌష్పం." (పుష్ప సంబంధి.)

త్రిశతిలోని చాలా శ్లోకాలకుకూడా ఇందులో పద్యాలు కనబడుతున్నాయి:—

''హ్రీంకారార్ణవ కౌస్తుభా, శుభకరీ,
హ్రీంకారమంత్రావృతా!
హ్రీంకారాంగణదీపికా! శివసతీ!
హ్రీంకారబీజాత్మికా!
హ్రీంకారాంబుధచంచలా! భగవతీ
హ్రీంకారవేద్యా!''

''హ్రీంకారాంబుజ భృంగికా! త్రిణ
యనా
హ్రీంకార పీఠాధిపా!''

''హ్రీంకారాంగణదీపికా! జనని, శ్రీ
హ్రీంకారసౌధస్థితా''

''లలితా! లాలితచంద్రశేఖర! లస
ల్లావణ్యపాథోనిధీ!
లలనారూప! లకారిణీ! లయకరీ!
లక్ష్మీసనాథస్తుతా!
లలనాభీష్టఫలప్రదా! భగవతీ!
లక్ష్యేతరా! లంపటా!''

లలితా ప్రభావ లేశ మింతో అంతో ఈమె గ్రహించిం దనటానికి ఈ క్రింది యుదాహరణములు:—

1. జయపంచాక్షరబిందుమధ్యనిలయా 2. మృదుగానామృతఫలమునిన్నీ లాంబరింబాడుట 3. సేవింపబడదే జగంబున సువాసిన్యర్చనప్రీతవంచు, 4. భూతేశార్ధశరీరమయ్యోస్ఫటికంపున్మేడఁ గ్రీడింప, 5. నీవన్నన్ త్రిమూర్త్యాది భాస్వరరూపంబవు 6. ఓంకారాగ్ర పీఠంబునన్ గొల్వుండు సుజ్జ్వలతేజోనిధి. 7. నవకోణావృతబిందు మధ్యనిలయా.

అక్కడక్కడా మంచి సామెతలు, ఉపమానాలు కూడ ఉపయోగించడంలో ఈ కవయిత్రి అందెవేసిన చెయ్యి:—

1. ధరలోనం బులిఁజూచి నక్కయును
 వాతల్వేట్టుకొన్నట్టులా.
2. జనని సంతోషింపదే యర్భకుల్
 కలమోదంబునఁ బల్క.
3. సూకరముల్ మెచ్చునె పుష్పసౌర
 భము, పంకంబు న్మదిన్మెచ్చెడిన్.
4. కాకం బెల్లరఁ దిట్టెనే? పికము
 బంగారంబు లందిచ్చెనే? లోకంబు
 ల్పగయాను వాక్పరుషతన్-తీయఁగా
 వాకొన్నంతనె మిత్రులయ్యెదరుగా!
5. పాముం బాలను బోసి పెంచికొన
 సంభావించునే ముద్దిడన్,
6. వేముం దేనియవోసి పెంచినను,
 దేవీ, తీపి రానేర్చునే?
7. పాలన్ముంచిన నీటముంచినను
 నీ పాదంబులే నమ్మితిన్
8. సరసీజంబులక్రింద భేకములు వాసం
 బుండి పద్మవ్రజోత్తర సౌగంధ్యములన్
 గ్రహింపనివిధిన్
9. స్వాతివర్షంబులోఁ జినుకుల్ ముత్తెపుఁ
 జిప్పలం బడిన రంజిల్లుంగదా ముత్తెమై
10. చిలుకం బంజరమందు నిల్పి పలు
 కుల్ చెన్నార నేర్పించినన్ బలుకు
 న్ముద్దుగ, వాయసంబు నిశీ పక్వం
 బైన పండ్లిచ్చుచుం బలుకుల్ నే
 ర్పినఁ బల్కనేర్చికొనునే?

ఈ అధునాతన శతకంలోకూడ శ్రీ కాళహస్తీశ్వర, రామలింగేశ, వేణుగోపాలాది శతకాల్లో మోస్తరు అవివేకులైన రాజులను దూషించే పద్యాలు కూడా కొన్ని లేకపోలేదు. కవయిత్రి యిట్టివి రచించటానికి కారణం స్వార్థవైఫల్యమేమయినా, వారివల్ల సంభవించిందేమో!

 "అనిఁబోరాడఁగలేక, సత్యమును ధ
 ర్మాధర్మ విజ్ఞానమున్
 గని పాలింపక, పండితప్రముఖ స
 త్కారంబుఁ గావింప, కో
 జననీ సొమ్ములు రమ్మనన్ బొదలఁగా
 సొల్వల్ పయింగప్పి "నే
 జననాథుం"-డన గంగిరెద్దు గతియా"
 "పరకాంతారతులౌచు, నీచులనుడుల్
 పాటింపు చున్మత్తులై
 ధరణీనాథు లెఱుంగనేర్తురె! కవి
 త్వాసారశైత్యంబు, సూ
 కరము ల్మెచ్చునె పుష్పసౌరభము పం
 కంబున్మదిన్మెచ్చెడిన్
 ఖరముల్ మెచ్చునె గంధధూళి"
 "దాసీ భోగ విలాస లాలసులు, ని
 ద్రాయత్తచిత్తుల్, పర
 త్రాసోన్మత్తులు, మద్యపాననిరతుల్
 దంభప్రతాపుల్ దుర
 భ్యాసాసక్తులు, రాజులైనఁ దనరు
 న్నా రాజ్యపున్లక్ష్మి రా
 కాసుం జేరిన రంభయట్లు"

"ఉత్సాహప్రభు మంత్రశక్తి యుతుఁడై
యుత్కృష్టుఁడై, సర్వసం
పత్సాద్గుణ్య గరిష్ఠుఁడై విబుధుఁడై
భాషాభిమానంబుతో
వాత్సల్యంబున రాజ్య మేలునతఁడే
వర్ణింపభూమీశుఁ, డీ
వత్సౌజన్యము లేనివాఁడు ప్రభువా!"

"తమరాజ్యంబున నుండువారలుభయో
త్పాతంబునం జిక్కి తా
మ మశూచ్యాదుల మృత్యువాతఁ
బడఁగా తన్నాథు లశాంతి మ
న్యమహీఖండములం జరించి నిజభా
గ్యశ్రీలఁ బోకార్చు మూ
ర్ఖమతుల్, హైందవ దేశ శాత్రవులిసీ"

ఈ శతకరాజంలో లక్షణవిరుద్ధాలయిన అఖండ యతులు, ద్రుతంమీది స్వరానికి ద్విత్వ "న" కారాలు కనబడుతున్నవి.

1. అఖండయతులు:—

ధరణీ రంజిలు రామశర్మ గుణ
రత్నాంభోధి,

తల్లీ, యాశ్రితకల్పవల్లి నిజభక్తౌఘాఘ,
సర్వాంబందు నినుం భజించి కద శాపా
నుగ్రహ
ధరణీనాథు లెఱుంగనేర్తురె కవిత్వా
సార,
దాసీభోగ విలాసలాలసులు నిద్రాయత్త

ఇట్టివి పెక్కులున్నవి.

2. ద్రుతంమీది అచ్చుకు 'న' కారద్విత్వం.— కాతిచ్చుటన్నవివేక - మానీంద్రులున్నే పాదంబులు- మెుగిన్నర్థించె - ఎటన్నుంచంగ - అరయన్నాయువు - మతిన్నుత్కృష్టులు - ఎన్నుదున్నే - అగుచున్నల్లాదశే - చోటికిన్నైవరు - నేరన్నైన.

"అన్నిష్టసఖి - సర్వమున్నతని"- అనునవి పూర్వ కవులు విధిలేనిపక్షంలో చేసిన ప్రయోగాలు కాని, అవి లాక్షణికాలని అనుకోరాదు.

ఇలాటి వేవో స్వల్పంగా పొరపాట్లు ఉన్నా, శతకంమాత్రం ఉత్తమశ్రేణికి చెందిం దనటంలో సందేహంలేదు. "ఏకోహి దోషో గుణసన్నిపాతే నిమజ్జతీందోః కిరణేష్వివాకః" - అను కవికులగురుని వచనమిచట స్మర్తవ్యము.

ఇదివఱకే, శతకంలోని పద్యాలా యా సందర్భాల్లో పెక్కు ఉటంకించాను. కనక, మచ్చుకు ప్రత్యేకంగా ఇయ్యక ఇంతటో విరమిస్తున్నాను.

---

తెలుగు పండితుడు "మాధవా! రామాయణ కావ్యం ఏ దేశంలో జరిగింది" అని ప్రశ్నించాడు క్లాసులో

మాధవుడు ఏమి మాట్లాడకుండా లేచి నిలుచున్నాడు.

"ఏంరా! యీ మాత్రం చెప్పలేవూ!"

"చెప్పలేకేమండీ!—భారతకథాకాలము నాటికి వారి మూల పురుషుడు శకుంతల కుమారుడు భరతుడని మీరే ఒక సారి చెప్పారుకదా - రామాయణ కథాకాలం నాటి కీదేశాని కేం పేరై యుండిందా అని ఆలోచిస్తున్నాను."

'అల్లూరి సోదరి'

---

# మరణదేవత

శ్రీ తిరుమల వెంకటేశ్వర్లు

అది పెద్దనగరం. దానికి బయట పెద్ద రాజబాట. బాటకిరువైపుల చింతచెట్ల వరుసలు. కాని ఆశ్చర్యం! – ప్రతిరోజూ ఆ బాటన పదిపన్నెండు మంది బాట సారులు చనిపోతుంటారు. ఒకరిని తేలు కరిచి, మరొకరిని పాముకరిచి రకరక ములుగా మృత్యుదేవతకాహుతి యగు తుంటారు. అందువలన ప్రజలు ఆబాటన ప్రయాణం చేయడం చాల అరుదై పోయింది.

రామయ్య ఆనగరవాసి. వయస్సు ముప్పై ఏళ్లుంటవి. అతడు ఆ బాటన బయలుదేరి వెళ్తుండగా ఒకరోజున నొక మండ్రగబ్బ కనుపించింది. రామయ్య చూస్తుండగానే అదిపాముగామారి ముందు నడుస్తున్న బాటసారిని కరువగా నతడు నురుగులు క్రక్కుతూ క్రిందపడి ప్రాణాలు వదిలాడు. రామయ్య ఆశ్చర్యంతో ఆ పామును వెంబడించి అలాగమరి కొంత దూరం వెళ్లాడు. పాము తిన్నగా వెళ్లి రాజప్రాసాదంలో ప్రవేశించింది. మరొక క్షణంలో ఆ నగరాధీశుని మరణవార్త వినవచ్చింది.

మరునాడు రామయ్య ఆయూరి ప్రక్కనే పారుతున్న కాలువ గట్టుకు వెళ్ళాడు. అంతకుముందు తానుచూచిన పాము చెట్లబాటున కనుపించింది. మరొక నిముషంలో నది దున్నపోతుగా మారింది. అక్కడ కాలువదాటుటకని ముగ్గురు కుర్రాళ్లు ప్రయత్నిస్తున్నారు. ఎంతసేపటికి పడవరాకపోవడంవలన వాళ్లలో ఆదుర్దా ఎక్కువయింది. చివరకు నీళ్లలోదిగబో తున్న దున్నపోతును చూచి దాని సహా యంతో కాలువదాట నుద్దేశించి యిద్దరు దానిమీద నెక్కి, ఒకడు తోకపట్టు కున్నాడు. దున్నపోతు కాలువలో దిగింది. సగం దూరంపోయి అమాంతంగా దున్న పోతు, దానితోబాటు ముగ్గురు కుర్రాళ్లు మునిగిపోయారు. కొంచెము సేపటికి దున్న మాత్రము ఒడ్డుకుచేరింది.

చూస్తూ యుండగానే దున్నపోతు ఒక చక్కని యువతిగా మారింది. ఇంతలో యిద్దరు యువకులు ఆదారిన వచ్చారు. అందులో నొకడు ఆయువతిని "ఎవరు నీవు? ఇచ్చట ఎందుకున్నావు?" అని అడిగాడు. ఆమె "నేను పరదేశిని; నాకెవరులేరు"

అన్నది "అయితే నన్ను పెళ్లిచేసి కుంటావా" అని అడిగాడు.

ఆమె "అలాగే - కాని నాకుచాల ఆకలిగానున్నది. ఏదైనా కొంచెము తిన డానికి తెచ్చిపెట్టు" అన్నది. సరేనని మరొకనిని ఆమె దగ్గరనే యుండమని తానే దైనా తినడానికి తేవడానికి వెళ్లాడు.

అతడు వెళ్లగానే ఆయువతి అచ్చట నున్న యువకునితో "అతడు నాకేం నచ్చ లేదు. నేను నిన్ను ప్రేమిస్తున్నాను. అతడు రాకముందే మనమిద్దరం యిచటనుండి పారి పోదాం" అన్నది.

కాని అతడు వప్పుకోక తనస్నేహితుడికి ద్రోహం చెయ్యలేనని ఖచ్చితంగా చెప్పాడు. ఆమెకు కోపంవచ్చింది. తిను బండారాలకొరకు పోయిన యువకుడు రాగానే ఏడుస్తూ అతని స్నేహితుడు తన్ను బలవంతంచేశాడని చెప్పింది. యువకులిద్దరు వరలనుండి కత్తులు దూసి హోరా హోరీగా పోరాడి ఒకరి నొకరు పొడుచుకొని చచ్చిపోయారు.

ఇదంతా చూస్తున్న రామయ్య విస్తు బోయాకు [illegible]యి ఎవరో-అనేక రూపాలెత్తిడమేమిటో తెలిసికోవాలనే ఆ సక్తి అధికమయింది. రామయ్య గబగబ ఆ యువతిని సమీపించి "నీవు ఎవరు తల్లీ! యింతమందిని చంపుతున్నావు" అని అడిగాడు

ఆ యువతి చిరునవ్వుతో "నేను మృత్యుదేవతను" అన్నది.

"మరినన్నెందుకు చంపలేదు"

"నీ జీవితానికింకా . అంత్య కాలం రాలేదు. ఇంకా యిరవై సంవత్సరాలు గడిచాక నిన్ను ఆహ్వానిస్తాను" అంటూ పక్షిగామారి ఆకాశమార్గాన ఎగిరి పోయింది.



## ప్రయాణీకుల సౌకర్యాలు

రైల్వే ప్రయాణీకులకు కనీస సౌకర్యాలు కల్పించడానికి, వారికి ఏ విధమైన లోటు రాకుండా చూడ డానికి ప్రతి రైల్వేకి ఒక స్పెషల్ ఆఫీసరుని నియమించడానికి రైల్వేబోర్డు నిర్ణయించింది. ఆ స్పెషలు ఆఫీసర్లు జనరలు మానేజర్ల అధికారానికి లోబడి పనిచేస్తారు. 1954-55-వ సంవత్సరంలో ప్రయాణీకులకు సౌకర్యాలు కల్పించే నిమిత్తం 3 కోట్ల రూపాయలు కేటాయించబడ్డాయి. రైల్వే ప్రయాణీకుల సౌకర్యాల కల్పనకు పంచవర్ష ప్రణాళిక క్రింద 15 కోట్ల రూపాయిలు వ్యయపరచబడనున్నాయి.

భారత ప్రభుత్వ సమాచారశాఖ

# తాతయ్య ప్రహసనం

**శ్రీ చేబ్రోలు సుబ్రహ్మణ్య శర్మ**

## 1–వ రంగము

[ఒకవూరు. ఆ ఊళ్లో ఒకరాజు. ఆ రాజుపేరు ఎవరికీ తెలియదు. కాని ప్రజలే పిల్చుకొనేపేరు ఒకటివుంది. అది యేమంటే, బుద్ధిలేని మహారాజు. ఆ రాజు దేవీ నవరాత్రులకి పెద్ద పండిత సభ చేయించాడు. ఆ సభలో ప్రతి పండితుడూ ఏదో సన్మానం పొంది తీరవచ్చు – అని ప్రచారం బాగా చేయించాడు.]

బుద్ధిలేని మహారాజు:–

ఆర్యులారా! నేను బుద్ధిలేనివాఁడనని బుద్ధిగల వారి నిర్ణయం కాఁబట్టి నేను బుద్ధిలేక ఈ సభ చేయిస్తున్నందుకు నన్ను మన్నించండి. నేను అన్నీ చదివేను; నాకేదీరాదు. పండిత ప్రకాండులారా! మీరన్నీ చదువలేదు; మీకన్నీ వచ్చునని మీరను కొంటారు. అదీ నిజమే! పాండిత్యం అంటే అర్థం తెలియని, తెలిసికోలేని, తెలిసికోడానికి అవకాశాలు లేని, వాతావరణంలో పెరిగిన నన్ను మీరు అన్యథాగా భావించక నా యసత్య ప్రలాపాలకు తిలోదకాలిస్తూ, సత్యవ్యావహారాల్కి తలలొగ్గండి. అదే నాకు ఆనందం — మీ పండితులకు సామర్థ్యం కన్న పట్టుదల యెక్కువ. అందుకే మిమ్మల్నిచూస్తే నాకే కాదు భయం, యముడికికూడా భయమే! వాణ్ణికూడా నీవు కొత్త యముడివా లేక పాత యముడివా అని ప్రశ్నించి హడలగొట్టి వానికి సన్యాసం ఇప్పించఁగలరు. ఓ పండిత ప్రకాండు లారా! మీకు మెదడుంటే హృదయం వుండదు, హృదయంవుంటే మెదడుండదు అని మాతాతయ్య చెప్తూ వుంటారు. అదినిజమనే నా అనుభవం – క్షమించండి – పై రెండూలేకపోతే శవశరీరరథం నడవదు. మరి యొక చిక్కు మీకు విడివడనిది. సంభావనకోఅకు ఓ చోటికి పోయి, లేదా కుక్షింభరిత్వానికి ఓస్థానాన్నుండి ఇంకో స్థానానికి పోయి, త్వంశుంఠ అంటే త్వంశుంట అని ఒకరి నొకరు తిట్టుకొని ఛార్జీలిచ్చుకొని ఓ పెయ్యమ్మని మీకంటె యెందుకు పనికిరాని వాజమ్మని –పెద్దమనిషిగాగోరి తగవుపరిష్కారం కోసం తంటాలు పడి ఆ మధ్యవర్తిగాడిదచేత ఆ యిద్దఱు పండితులు గాడిదలనిపించుకొంటారుట! నిజమేనా? ఛా! నిజమేనా అని ఓ ప్రశ్నా! నా పేరే ఈ విషయానికి పెద్ద సాక్ష్యం. నేనెందరోన్ని గాడిదలను తిట్టిన గాడిదను! సరేలెండి! మీరు కేవలం ఉదరపోషణకే ఏడ్చేవాళ్లలాగ కనపడరుకదా కర్మం! కీర్తి కాంత గాజుల హస్తస్పర్శ కావాలంటారు — దీంతోటే పేచీ ముదురుతూంది సర్వత్రాను. ధనానికే ఏడ్చే వాళ్లైతే ఈ యేడ్పులుండవు. ఎందుకంటానా? "పాకీది గణింపదే ధనము?" అని వుందిగా సూక్తి. అంగట్లోకి వెళ్లి అణాయిచ్చి వీసెచక్కెర యిస్తావా చస్తావా అన్నట్లు దమ్మిడీన్నర చదువుచదివి వరహాకీర్తి కోరేమూర్ఖులు మీ పండితుల్లో అధికం అని మా అమ్మమ్మ చెప్తూన్న మాట నిజం అని ప్రతి రోజూ అనిపిస్తూనే ఉంది నాకు.

ఓ నాడు మా అమ్మమ్మతో "కాదే అమ్మమ్మా! మా వూళ్లో లంబోదర శాస్త్రికి పాండిత్యం పూర్ణానుస్వారమే. కీర్తి కోరకుండానే పెద్దకీర్తివచ్చేసిందే" అన్నాను. అంటే "పుణ్యైర్యశోలభ్యతే" అంది. అంటే ఆఘాయిత్యం శాస్త్రిల వార్లకు కీర్తియెక్కువగా వస్తుందని అర్థంచేసుకొన్నాను. "అణా ఈయనక్కరలేకుండా, వర్తకుడు చూడకుండానే వీసె చక్కెర కాజేస్తే ఆ చక్కెర లభించవచ్చుగాదా అమ్మమ్మా!" అని ప్రశ్నించాను. 'అవును నాయనా!' అంది. "అయితే దొంగతనమే పుణ్యమన్నమాట"

అన్నాను. నా ప్రశ్నలకు సమాధానం చెప్పలేక పోయింది. నేనే గెలిచాను - అన్న. ఆనాటి సంతోషం యీనాటి వరకూ ప్రవాహినిగానే ఉంది నాకు. ఇంక నా వుపన్యాసానికి తలాతోకా, శుద్ధి బద్ధం, అథం శుభం, మంచీచెడ్డా వుండవు. దీనికి కారణం మీ పండిత సహవాసమే అని నా సంపూర్ణ విశ్వాసం. కాని రేపు సభలో మీ మీ పాండిత్యాలకు తగిన వేషం భాషలు సద్దుకుని చూచుకొని రండి. గంగిరెద్దు వేషాలు, బఢేకారు వేషాలు, షోదా వేషాలు కట్టిపెట్టండి. దడబిడలు, అనుకరణాలు, మాయలు, కంగాళీలు వదులుకొనిరండి. ఆత్మస్తుతి, పరనింద అసలు పనికిరావు. ఆ రెండూ లేకపోతే ఒక క్షణం మేము బ్రతకలేం అనక జాగ్రతతోరండి. సత్య దృష్టితో తగినఫలం పొందండి. మీ యర్హతలు నా దగ్గర చూపండి. మీరు కోరిన కాన్కలు కోరుకోండి. మిమ్మల్ని తృప్తి పరుస్తాను - ఇఁక సెలవు - భోజనానిక్కి సమయం మీ యనుష్ఠానాలు తీర్చుకోండి."

(ఆ నాటికి సభ ముగిసింది)

## 2-వ రంగం

రాజు:-మంత్రీ! ఈ రోజున సభలో పరీక్షకు వచ్చిన పండితుల లెఖ్ఖలు వ్రాసి తెచ్చితివా?

మంత్రి:-చిత్తం! కాని ఆ లిస్టుగొడవ నాకు అగమ్యగోచరం — ఎన్ని రాజ్యాలలోనైనా మంత్రిత్వం నిర్వహించేను గాని యింత గరడగొయ్యి వ్యాపారాలు నాకు ఎక్కడా సంప్రాప్తం కాలేదు సామీ!

రా:-ఏమి! వుపన్యాసం? — సారాంశం యేమంటావ్?

మం.:ఏమి ప్రభూ! అందఱూ పండితులేనఁట! అందఱూ కవులేనఁట! అందఱూ విమర్శకులేనట! అందఱూ పీఠికా జ్ఞాన పండితులేనట! ఏవేవో వెధవ గొడవ! ఒకాయన కాశ్మీర శాలువాతో వచ్చి, చెప్పింది చెప్పకుండా చెప్పినాడు. అది విన్నాయన ప్రక్కననే నిలబడి నాదీ అంతేనండి అదే నా పద్దూనూ! అన్నాఁడు అల్లాగే, ఒకరు తరువాత ఒకరు ఓ గుంపుగావచ్చి వాగేరు!

రా:-ఏయ్! మంత్రివర్యా! శుద్ధ భాష లో మాట్లాడు. పండితులను విసుగుకొనకు; హేళన చేయకు! నేను చేస్తున్నానని నీవూ ప్రారంభించేవూ! సరి సరి! ఇక పవిత్రభావలో మాట్లాడు. నీ కాగుంపు ఏదేశస్థులని తోచింది.

మం:-(రహస్యంగా చెప్తాడు.)

రా:-అదా! అలా చెప్పు-ఆ సంగతి అంతా నిజమే. అక్కడ ప్రతివాడూ కవి, పండితుఁడూ, విమర్శకుఁడూ, వక్త, సర్వం, సర్వజ్ఞత్వంతోటే ఉంటుంది - సరి సరి! అందుకా నీకు అంతమంట. వారిని సామాన్యులుగా చూడకు!

మం:-చిత్తం చిత్తం! అంత గొప్పవారాండి!!

రా:-అందుకు సందేహమా!

మం:-చిన్న పండితుఁడు, పెద్దపండితుఁడు అని భేదముండదండీ బాబూ! 'ఏదో దిక్కుమాలినరాజు కవులకి, పండితులకీ తనరాజ్యం ధారపోసుకొన్నాట్ట. వాడిపేరేవుందికాని - ఆ రాజ్యం ఏదండి భాబూ?

రా:-అయితే రాజ్యం స్థిరంగావుంటే చాలా? పేరు అక్కర్లేదా?

మం:-పేరెందుకుబాబూ! రాజ్యంలేని రాజుపేరు స్థిరం అయితే ఎవరికి సంతోషం - ఈ పేర్లు స్థిరాలవడంలో బట్టుకవులేగా హేతువు? వద్దు బాబూ! మనకాలాంటిపేరు.

రా:-అయితే మనరాజ్యం స్థిరంగా వుండేటట్లు, ఏదైనా పేరువస్తే వచ్చేటట్లు, ఈ పండితకవుల సన్మానం ఏర్పాటుచేసినావా?

మం:-ఆఁ తయారుచేసేనండి పథకం.

రా:-ఏమది?

మం:-ఈ పండితకవులకి అగ్రహారాలు ఏమీ యివ్వ

బడవు - ఎందుకంటే, అగ్రహారాలు మనకే హక్కులేనివయ్యాయి కనుక. పప్పుభోజనాలు దండిగాపెడితే కరువురోజుల్లోతిని సంతోషిస్తారు. అదే పెద్ద సన్మానం. ఇంకా చాలదని యేడ్చే వాళ్ళకి కింకవీంద్రులు, ఘటాపంచాననులు, ఆంధ్ర వాల్మీకులు, ఆంధ్ర వ్యాసులు, చరిత్ర చతురాననులు, పండితరాజులు, రాజపండితులు, అభినవ శ్రీనాథులు, అభినవ హరిహరరాయలు, వగైరా బిరుదులు రాగిరేకులమీఁద కొట్టించి పారేద్దాం. ఇంకా చాలదనేవార్కి మన మత్తగజంపై ఊరేగిద్దాం. చిల్లరి మల్లరి కవులకి కాఫీ టీలు చాలు.

రా:-పైదానితో సన్మానం పూర్తికాదే !

మం:-దొంగ కవులు, దొంగ విమర్శకులు, మోసగాండ్రు, ఈ వచ్చేవాళ్లల్లో ఉండితీరుతారని సలసలనూనె నాల్గుమళ్లు కాగించేను. కావలసినన్ని వాతలు ఏక్‌దమ్ముగా ఒకేసారి వేయించే ఏర్పాటు చేయించేనండి బాబయ్యా !

రా:-కవులు, విమర్శకులు దొంగలుగా ఉంటారయ్యా?

మం:-అందుకు సందేహమా రాజా !

రా:-కాదయ్యా ! ఇస్తే ఇచ్చేవు — లేకపోతే లేదు ఈ వాత లెందుకయ్యా !

మం:-వెధవపనులు చేయకుండా ఉండడానికి.

రా:-వారిని కనిపెట్టేవాడెవడు ?

మం:-నేనేనండి బాబూ !

రా:-నీకంత జ్ఞానమున్నదా ?

మం:-మా ముత్తాత తాత ముత్తాతనుండీ మా వంశంలో కవి, విమర్శకుడూ కానివాడు లేనే లేడండి బాబూ ! యింతవఱకూనూ.

రా:-అయితే నీకు పాండిత్యం ఉందా ?

మం:-పాండిత్యానికి కావలసిన గర్వం, అహంకారం వగైరాలు ఉన్నాయండి ! అవి - చాలునండి దొంగపండితుల్ని ఏడిపించడానికి.

రా:-అయితే ఏదో చూచుకోమరి.

మం:-అంతా సిద్ధం ప్రభూ !

## 3-వ రంగం

[పెద్దసభ — పశ్చిమాభిముఖులై ముందు సనాతనులు, తరువాత ఛాందసులు, వైదికులు, గాయకులు — నాలుగుబార్లు తీరి నాల్గువేలమంది కూర్చున్నారు. వీరికెదుట ప్రాగభిముఖులై కవులు, విమర్శకులు, శిల్పులు, శాస్త్రపండితులు, నాలుగుబారులు తీర్చి ఎనిమిదివేలమంది కూర్చున్నారు. కలగూరగంప పండితులు, సాంబారు పండితులు, కదంబం పండితులు, ఉప్మాపోపు పండితులు నాలుగు బార్లు తీరి నాల్గు వేలమంది దక్షిణాభిముఖులై కూర్చున్నారు. మాయలమరాఠీ పండితులు, పీతికాజ్ఞాన పండితులు, పాఠభేదాల పండితులు, శాసనాల పండితులు దక్షిణాభిముఖులై కూర్చున్నారు.

వీరందరిమధ్య సభ్యులు పదియర్బుదములు కూర్చున్నారు. రాజుగారు మంత్రిగారు — పశ్చిమాభిముఖులై కూరుచున్నా నిలువుటద్దాలు పెద్దపెద్దవి నలువైపులా ఉంచటంవల్ల నలుముఖంగా . వారిద్దరూ కూర్చున్నట్లు ఉన్నారు. లౌడ్ స్పీకర్లు సభనంతటా సద్దినారు.

యముడువలె రాజుగారు చిత్రగుప్తుఁడువలె మంత్రిగారు వ్యవహారాలు సరిగా నడపుటకు ఏర్పాట్లు ప్రతిద్వారాలల్లోనూ చేసినారు.]

మం:-ప్రతిభామయమూర్తులారా! పండిత ప్రకాండులారా ! మీ మీ విద్యా విశేషములను ఈ సభలో ప్రభువుల యెదుట ప్రదర్శించి తగిన బహుమానములను స్వీకరింప గోరుచున్నాను. ప్రప్రథమతః సనాతనులు దయచేయవలసినది. అందొక్కరొక్కరేవచ్చి యీ సంఘంలోగల విద్యాధికుల తరతమ భావములను మీరే గుర్తించి వరుసగా సన్మానముల నందుకొనండి.

సనాతనుల నాయకుడు:-మహారాజా ! మా సంఘానికి మీ సన్మానం ఏమీ అక్కర్లేదు. కాని మీ

బోటి రాజులు రాలిపోకుండా ఉండాలంటే మా వర్ణాశ్రమ ధర్మాలు కాపాడాలి. ఇంతే! మాకు సెలవు. మా పాండిత్యం ఒకరికి చూపిస్తే అవగాహన అయ్యేదికాదు.

మం:-(తనలో) చాలా శాలువాలు మిగిలిపోయినాయి బాబూ! పోండి - పోండి. (పైకి) ఆర్యులారా! మా రాజుగారు మీ అభిప్రాయంతోనే ఉన్నారు. వర్ణాశ్రమ ధర్మాలను రాజులే కాపాడాలంటే కుదరదు. ప్రజల సహాయం సంపూర్ణంగా ఉండాలి.

స.నా.నా:-ప్రజలు రాజు దృష్టినిబట్టి నడుస్తారు. రాజా రాష్ట్రకృతం పాపం - అని శాస్త్రం.

మం:-ఆ రోజులు మళ్లీ రావాలి. తమరు దయచేయండి.

[సనాతనులు నిష్క్రమిస్తారు]

ఛాందసులు దయచేయండి !

[దయచేయండి అనగానే వారు దొడ్డిదారిని వెడలిపోయిరి - మంత్రిని, రాజుగారిని, వారిద్దరుచేసిన బందోబస్తూ, చూస్తే ఈ ఛాందసులకి గుండెపగిలిపోయి పారిపోవటానికి సందు చూస్తూండగా "దయచేయండి" అనే పదార్థంతోటి సందుగుండా వెళ్లిపోయారు.]

మం:-తరువాతవారు - వైదిక శ్రేష్ఠులారా! తమ వేదగానం వినిపించండి.

[వైదిక శ్రేష్ఠులు నాలుగు ఆశీర్వచనపనసలు చదివి, చేయిచాపి నిలుచున్నారు.]

మం:-మీకు అందరికీ ఒకేరీతి సంభావనచాలా? కాస్త పెద్ద సంభావన, చిన్న సంభావన అని భేదం ఉంచాలా?

వైదిక శ్రేష్ఠులు:-అక్కర్లేదు బాబయ్యా! ఒకే రీతిగా యిప్పించండి.

మం:-అందరు సరిసమాన సంస్కారులేనా?

వై.శ్రే:-ఏదో కొంచెం తేడావున్నా ఆ కాస్త తేడా వారి వారి గుణాలతో సరిపోతుందిలెండి.

మం:-అంటే?

వై.శ్రే:-మీరిచ్చే సంభావనబట్టి వివరించాలి. ఆ సంభావన ఏమాత్రమో సెలవియ్యండి.

మం:-నీవు కోరినంతా నీకు ఇస్తాంలే చెప్పవయ్యా.

వై.శ్రే:-అల్లా చెప్పండి. అయితే ఓ ఘనాంత స్వాధ్యాయి ఉన్నాడనుకోండి. వాడి చదువు కాల ఎవడికీ ఒక ముక్క చెప్పడు. అట్టివాడు అసంస్కారియే - ఇంకోరకం ఘనాపాఠీ వడ్డీ వ్యాపారాలు నడుపుతాడు. వీడూ అంతే. ఇంకోడు పెధవముండల్ని తీర్థయాత్రలకు త్రిప్పుతాడు. వాడూ అంతే. ఇంకోడు చెప్పుల దానం, గజదానం, మహిషదానం, వగైరాలకు పడకొండు, పంద్రెండ్లకు పోతాడు-వీడూ అంతే. ఇంకోడు కొబ్బరికాయ వర్తకం, ధాన్యంవర్తకం, వ్యవసాయం. నల్లమందులపాటలు వగైరాలు చేస్తుంటే, వేదం చదివేడు అన్నగుణం కాస్తా కళంకితమైందన్న మాట. క్రమాంతస్వాధ్యాయియైనా నిత్యదేవతార్చనలు, నిత్యపాఠ ప్రవచనములు, నిత్యదైవారాధనలు వీనితోనే ఉంటాడు. చదువులు కాస్త తక్కువైనా వీనికి చాలినవాడు లేడు. ఇంకోరకం వైదికులున్నారు. వీరు నిత్యం సహస్రగాయిత్రీ చేస్తుంటారు - ఇంకోరకం వైదికులు నిత్యం అగ్నిహోత్రాలు చేస్తుంటారు. ఇంకోరకంవారు గోసేవ చేస్తూంటారు - వీరంతా ఘనపాఠీలకన్నా వేయిరెట్లు ఘనులు. కనుక గుణాలనుబట్టి హెచ్చుతగ్గు సరిచేసుకొంటే మీరిచ్చే సన్మానం అందరూ సమానంగా పుచ్చుకొనుటకు అర్హులే. ఇంకా వివరించవచ్చు. కాని మీకూ, వినేవారికి, చెప్పే నాకూ విసుగుతప్ప లాభం ఉండదు. క్షమించి మమ్మల్ని పంపండి.

మం:-సరే అందరికి ఒక్కొక్క శాలువా ఒక్కొక్క

కుండనాల జత ఇప్పిస్తున్నాం. సంతోషించి, ఆశీర్వదించి ప్రతి సంవత్సరం వచ్చిపోతూండండి.

వై. శ్రే:- శెలవు శెలవు.

[నిష్క్రమిస్తారు]

మం:- తరువాత వారు గాయకులు.

గాయకనాయకుడు:- మహారాజా! మా పాండిత్యం ఒక్క రోజుతో తేలదు. చాలా వ్యవహారం వుంది. మీరు మా సర్టిఫికేట్లుచూచి మమ్మల్ని సన్మానించాలి.

మం:- ఏమి? ఎందుచేత మీ పాండిత్యం చూపలేరూ?

గా. నా:- శాస్త్ర పాండిత్యం ఘనంగావున్నా గాత్రం కాస్తా బాగుండకపోతే వినేవారికి శాస్త్ర పాండిత్యం చచ్చిపేడ్వదు కనుక కష్టమని సెలవిచ్చినా బాబయ్యా!

మం:- ఇంకా చెప్పు.

గా. నా:- తల బాగా ఊపే మద్దిలగాడిని గొప్ప విద్వాంసుఁడని, జుట్టుకూడా విరబోసుకొని ముందుకి వెనక్కి బాగా వూగే మద్దిలవాడే గొప్పవాడని భ్రమించే అవకాశాలు వున్నాయి కనుక నున్నూ కష్టమని సెలవిచ్చినాను. అసలు పాండిత్యంకన్నా ఫిడేలు, వీణ వగైరాలలో గింజుకోవడాలు ఎక్కువగా వున్నవాడే పండితుఁడని చెలామణీ అయే పరిస్థితులున్నాయి కనుక కష్టం అన్నాను బాబయ్యా!

మం:- అయితే సమానంగా సన్మానిస్తే తగువులాడకుండా వుంటారా మీవాళ్లు?

గా. నా:- ఈ సభలో, ఈ వీధిలో, ఈ వూళ్ళో నోరెత్తకుండా వుంటారు బాబయ్యా!

మం:- అంటే తరువాత—

గా. నా:- ఇళ్లకిపోయి మరోచోట సంభావనకివెళ్ళి అక్కడ గోలెత్తుతూ ఒకరినొకరు తిట్టుకొంటారు.

మం:- ఇక్కడాపని యెందుకు చేయరు?

గా. నా:- మన మహారాజులుగారు యమవర్తులని తమరు వారి హెడ్ గుమాస్తాలని—

మం:- అంటే నేను చిత్రగుప్తుణ్ణా? ఆరిపిడుగా! ఎంతమాటన్నావు? అయితేనేంలే. మనం అంటే అంత మాత్రం భయంవుంటేచాలు.

గా. నా:- అందుకు సందేహమా బాబూ! ఇతరత్రా కూడా నోరు నొక్కేయవచ్చు. ఓ మంత్రం మీరు ప్రయోగిస్తే.

మం:- ఏమది.

గా. నా:- సంవత్సరానికి నాల్గుసార్లు మీ గాయకుల్ని ఆహ్వానిస్తాం, వస్తూండండి అని అనండి, రప్పించండి, కాస్త పప్పూ అన్నం దండిగా పారెయ్యండి కిక్కురుమనరు.

మం:- ఇంతకే సంతోషిస్తే తప్పక చేయిస్తాను. మీరు మాత్రం నాలుగుసార్లువచ్చి వీళ్లనందర్ని సర్దుకుపోతూండండి, మళ్లీ నానెత్తిమీదికే బాధా తీసుకుని రాకుండా—

గా. నా:- విరమిస్తారు.

[అందఱూ నిష్క్రమిస్తారు]

మం:- తరువాయివారు-కవులలో వివిధశాఖలున్నాయి కనుక నేనిదివఱకు చెప్పిన ప్రకారం ఆయా శాఖల నాయకులు ముందుకువచ్చి మీ కోర్కెలు మీ కవిత్వాలు చెప్పండి.

కవు:- మాకు శాఖలు యిదివర్లో ఉన్నా ఈ మధ్య అవన్నీ మాయంచేసుకొన్నాం. మా కవులలో తరతమం భేదాలు, భావాలులేవు - అందరం సమానులమే. ఒకరుచెప్పే కవిత్వం ఇంకోరు చెప్పలేరు - అందుచేత ప్రతికవికీ విశిష్టత వుంద

నిన్ని అందుచేత తరతమ భావాలు వదలుకోవలసి వచ్చింది.

మం:భాషలో తరతమ భావాలుండవా ?

కవు:-భావకంత ప్రాధాన్యం ఈయవద్దని ఓ నిర్ణయానికి వచ్చాం. భావాలు పిన్నలకి పెద్దలకి సమానమే.

మం:-పట్టం కట్టాలంటే మీలో పెద్ద ఎవరని మేం తెల్సుకోవాలి ?

కవు:-ఓటింగ్ పెట్టించండి — అంతేగతి.

మం:-ఈ ఓటింగ్ పీడ మీకెందుకయ్యా ?

కవు:-అంటే బాబూ నోరెత్తి ఫలానావాడు గొప్ప కవి అన్నామా ! మరుక్షణమే వాని కావ్యాలు కాల్చేసెయ్యాలి అని బయలుదేరుతారు దరిద్రులు. అందుకని అట్లా సెలవిచ్చాను.

మం:-కవులకే ఈ సభ ఎక్కువ ప్రాముఖ్యం వహించాలని మా రాజావారి వుద్దేశం.

కవు:-అయితే బాబూ వున్న సంగతి చెప్పకూడదు. చెప్పితినా నానెత్తిమీద వెంద్రుకలుండనీయరు. నన్ను బ్రతుకనీయరు.

మం:-నిన్ను నేను కాపాడుతాను చెప్పవయ్యా ! అసలు మాకు యీ మర్మాలన్నీ బాగా తెలియాలి.

కవి:-(రాజుగారితో రహస్యంగా) ఓకవి ఓకవిని గురించి ఏదేదో మాట్లాడి ఆకవి కూట్లో కాస్త దుమ్ము పోస్తూండడం సహజమైపోయింది. నాకు మీ సంస్థానంలో ఆస్థాన కవీశ్వరపదవి ఇవ్వాళ యింతమందిలో ఇచ్చి పట్టం కట్టెయ్యండి. ఈ మర్మాలన్నీ చెప్తాను. లేదా నన్ను అడుక్కొని తిననీయకుండా చేయగలరీ పాపిష్ఠి కవులు !

మం:-అయితే రాజావారితో చెప్పి యిప్పుడే ఏర్పాటు చేయిస్తున్నాను.

కవి:-ఇది చాల రహస్యంగా - జరగాలి. జరిగిన పిమ్మట ఊరేగినా ఇబ్బందిలేదు.

మం:-ఇదికూడా నాకు చెప్పాలా.

[రాజుగారితో మంత్రి ఒక నిమిషం మాట్లాడి రెండో నిముషంలో ఆస్థాన విద్వత్కవి పదవి పేరూ ఊరూలేని రక్తం చీమూలేని శంకయ్యకి యివ్వడం అయింది] రేపటినుండి విద్వత్కవిగారి ఆధ్యక్షతన సభలు జరుగును. ఈ వేళటికి సభ సమాప్తం. రేపు మామూలుగా రండి.

(సశేషము)

# మనుజునకు రక్తమే జీవనము

రక్తమే ప్రాణాధారము. ఈ రక్తము దేహమంతయు నాడుల మార్గమున పారి శరీరపటుత్వమును కలిగించుచున్నది. రక్తము మనము భుజించు ఆహారము నుండి పుట్టుచున్నది. కొందరు తమ శరీరదార్ఢ్యమును కాపాడుకొను మార్గములను మఱచి వ్యాధుల పాలగుచున్నారు. ఇక్కాలపు విద్యావ్యాసంగము ఉద్యోగ ధర్మములు చాలవరకు మనుజులను అనారోగ్యులుగ జేయుచున్నవి. మఱియు విశేష సంచారము, అక్కాల భోజనము, మితిమీరిన భోజనము, మనోవ్యాకులము, మొదలగు వాటిచేత మనుజునకు జఠరాగ్ని మందగించి ఆహారమందు యిచ్ఛలేక వ్యాధిగ్రస్తుడగుచున్నాడు. ఈ కారణమువలన కొంతకాలమునకు శరీరమునందు నిరాటంకముగా ప్రవహించెడు రక్తమునకు ఆటంకము గలిగి అశక్తుడై, రక్తముచెడి అజీర్ణము ముఖ్యముగా సంభవించుచున్నది. ఈ అజీర్ణవ్యాధిని ఆధారపఱుచుకొని గుల్మము, కడుపుబ్బరము, మలబద్ధము, భేదులు, వాంతి, అరుచి, పాండు, కామిల మొదలగు వ్యాధులు కలుగుచున్నవి — మందబుద్ధి, ధాతుక్షీణము కూడ కలుగుచున్నవి. అపరిశుద్ధ రక్తమువలన శోభ, తీట, మేహపొడ, తామర, మేహవ్రణములు మొదలగు చర్మవ్యాధులు కలుగుచున్నవి.

ధాతుక్షీణము, అశుద్ధరక్తము, రక్తమునకు ఆటంకము కలిగించి పక్షవాతము, సంధివాతము, మొదలగు వాతరోగములు సంభవించుచున్నవి. శ్వాసకోశములు, హృదయము, పిత్తకోశముచెడి, కాసక్షయాదులు, హృద్రోగము, ఉన్మాదము, మూర్ఛ, మొదలగు వ్యాధులు సంభవించును.

సమస్తవ్యాధులకు మూల కారణమగు అపరిశుద్ధ రక్తమును శుద్ధపరచి మనుజుని ఆరోగ్యమును కాపాడుటకు మా 'అమృత' శ్రేష్ఠమయినదని వాడినవారు చెప్పుచున్నారు.

'అమృత' పైవ్యాధులను కుదుర్చుటయేగాక నిలుకడగనుండు తలనొప్పి, కడుపులోమంట, అఱిచేతులు, అఱికాళ్లు, కండ్లమంటలు, నిక్కాక, నిద్రలేమి, వీటిని నివర్తించును.

'అమృత' లో మూత్రసంబంధమైన జబ్బులను కుదుర్చు ఓషధులు కలిసియుండుటచే మూత్రపు అడ్డు తొలగి ప్రమేహ రోగములును కుదురును. విషములను విరుచుమూలికలు చేరియున్నవి గనుక, విషక్రిమి కాటులవల్లను, రసగంధక, పాషాణాది విషద్రవ్య దోషములవల్లను చెడినరక్తమును శుద్ధియగును.

'అమృత' వలన స్వప్నస్ఖలనము, శుక్లస్రావము మందబుద్ధి, సుఖ సంకటములు, కీళ్లనొప్పులు మొదలగు జబ్బులు కుదురుచున్నవి. మంచిబలము, రక్తవృద్ధి, ఆరోగ్యము, ఇంద్రియపుష్టి, వాక్చాతుర్యము, దీర్ఘాలోచనశక్తి కలుగుచున్నవి.

'అమృత' సారవంతములగు మూలికలతోను, రసవంతములగు ఫలములతోను మకరందపూరితములగు పుష్పజాతులతోను తయారుచేయబడిన ద్రావకము. ఇది బాల్య, యౌవన, కౌమార, వార్ధక్యదశల యందు ఎల్లరు సేవించుటకు దగినట్లు తయారు చేయబడినది.

'అమృత' యను నామమునకు తగినట్లు రుచికరముగను యింపైన సువాసనతో నిండియుండునట్లుగను తయారు చేయబడినది.

12 ఔ॥ బుడ్డి రు. 4—4—0

6 ఔ॥ బుడ్డి రు. 2—4—0

## కేసరి కుటీరం లిమిటెడ్

15, వెస్టుకాట్ రోడ్డు, రాయపేట, మద్రాసు 14

తెలంగుజిల్లాలకు, నైజామునకు ఏజంట్లు :

**శీతారాం జనరల్ స్టోర్స్, బెజవాడ — సికిందరాబాదు**

# చీపురుదెబ్బ చెంపపెట్టు



శ్రీ నందివాడ కామేశ్వరరావు

అవి మేము ఫోర్తుఫారం చదువుతూ వున్న రోజులు. ఆరోజుల్లో మేము చేసే అల్లరి చెప్పనలవిగాదు. మా క్లాసుకి తెలుగు పాఠం చెప్పడానికి నామాల పండితుడు ఒకాయన వస్తూవుండేవాడు. అతనికి వుల్లికూర అంటే మహాయిష్టం. యేదైనా పాఠం సంధర్భంలో భోజనంగురించి ప్రస్తావనవస్తే, 'వుల్లి అయిన వుండవలె, లేక తల్లి అయిన వుండవలె భోజనోత్తరవేళన్' అని సామెతలు చెపుతూవుండేవాడు. క్లాసులోనికి రాగానే ఒక కుర్రవాడిని పిలిచి, 'ఒరే, వీరన్నా! దేవీవిలాస్‌కి వెళ్ళి రెండు దోశెలు వుల్లిచట్నీ లావుగావేసి తీసుకు రారా!' అని ఆర్డరుయిచ్చేవాడు. నలభై అయిదు నిమిషాల పీరీడు దోశెలు తిండంతోనే గడిచిపోయేది పాపం ఆనామాల పండితునికి. క్లాసులో పాఠాలు చెప్పడం యెట్లాగున్న పరీక్షసమయంలో మాత్రం అందులో నున్నప్రశ్నలన్నీ చెప్పేసేవాడు. అదే అతనిలోవున్న ముఖ్యమైన సుగుణం. ఉల్లిపాయ మేష్టారి ఆకారవికారాదులుయెలాగున్న అతనికూతురు మాత్రం బంతి పువ్వులాగ వుండేది. ఆపిల్ల వయ్యారంగా గరల్సు రూంలోంచి హంసలాగ నడుస్తూ వస్తూవుంటే మా కుర్రకుంకలము క్లాసు రూం కిటికీలలోంచి తొంగి తొంగి చూచే వాళ్ళము. మా చేష్టలుచూచి ఆ వయ్యారి భామ పెదిమలు యిటుఅటూ త్రిప్పుతూ (వెక్కిరిస్తూ)తన సీట్లోకి పోయి కూర్చునేది.

ఆమె చేష్టలుచూచి మా యూనియన్ వారు సహించలేకపోయేరు. ఎలాగైనా ఆ వయ్యారిభామ భరతం పట్టాలనుకున్నారు. ఒక రోజు ఆదివారంనాడు మేమంతా డ్రిల్లుగ్రౌండులో సమావేశమై మాలోమేము చర్చించుకుంటున్నాము. యీమెను యేంచేస్తే బాగుంటుందా అన్న ప్రశ్న మాకు పెద్ద సమస్యగా పరిణమించింది. యింతలోకే మా శక్రటరీ బోదకాలు వెంకన్న (అంటే వాడికొక కాలు ఎలిఫెంటు లెగ్ లెండి, అందుచేత వాడికా టైటిలు యివ్వవలసివచ్చింది) "లేచి, ఓ! సభ్యులారా! మీరేమీ గాబరాపడకండి. నేను మంచివుపాయం ఆలోచించేను. ఆ విధంగా దానిపని పట్టేస్తాను. యిప్పుడేమి పయికి చెప్పకూడదు. కార్యం జరిగిన తరువాత మీరేచూడుదురుగాని" అన్నాడు. వాడిమాటకి మేమంతా ఆమోదించి సమావేశం చాలించేము.

ఆ రోజు చీకటి పడ్డతరువాత వెంకన్న మా యింటికివచ్చి, ''ఒరే! బుచ్చిబాబులు పదారా వెళ్దాము'' అన్నాడు. (బుచ్చిబాబు అంటే నాముద్దుపేరు)

''ఎక్కడికిరా! యీ రాత్రి పూట?'' అన్నాను ఆశ్చర్యంగా.

''నీముఖంలాగవుంది - యిదేఛాన్సు. మళ్ళీ యిలాంటి సమయం దొరకడంచాలా కష్టం. యివ్వాళ వుల్లిపాయమేష్టరు మెయిల్లో విశాఖపట్నం వెళ్ళేడుట. అందుకే యీ అదునుకనిపెట్టి నీ దగ్గరకు వచ్చేను. పదపద'' అంటూ నారెక్క పట్టుకుని లాక్కు వెళ్లిపోయాడు.

మేమిద్దరం కలిసి గురువుగారియింటి గుమ్మందాకా వెళ్ళేము. నేనుమాత్రం వీధిగుమ్మంలో వున్న కొళాయిగట్టు దగ్గర నించున్నాను. మా వాడు గురువుగారి యింటి గుమ్మంలోనికి వెళ్ళి, ''బాబూ! మేష్టరుగారూ! తలుపు తీయండి!'' అని కేకవేస్తున్నాడు. వాడి కేకలకి లోపల యేదో పని చేసుకుంటూవున్న రామ చిలుక బయటకువచ్చి, 'యెవరండీమీరు?' అని ప్రశ్నించింది.

'మేమా! గురువుగారి ప్రియశిష్యులము. ఒక అత్యవసరమైన పనిమీద యిలాగ వచ్చేము. తలుపు తీయించండి' అన్నాడు మా వెంకన్న.

'ఓహో! మీరా!' అంటూ తలుపు కొంచెం ఓరగాతీసి, 'మాష్టరుగారు వూళ్ళో లేరు. మీకేంకావాలో చెప్పండి? ఆయన వచ్చేక చెప్తాను' అన్నది సన్నని గొంతుకతో.

మా వెంకన్నకి ముచ్చెమటలు పోసేస్తున్నాయి. యేమనాలో నోరు ఆడ్డం లేదు. యెలాగో ధైర్యం తెచ్చుకుని, ''అబ్బే మరేమీలేదండీ! యీ మధ్యను మా గురువుగారు, 'ఆలింగనము, ప్రేమముద్దు' అని రెండు క్రొత్త నవలలు వ్రాసేరుట. అవికూడ మొన్ననే అచ్చుఅయి వచ్చేయని తెలిసింది. ఆ రెండూ యిప్పిస్తే చాలా సంతోషిస్తాము'' అన్నాడు మెల్లగా తడబడుతూ. ఆ పిల్ల మనసులో చిన్నచిరునవ్వు నవ్వుకొని, వీళ్ళకితగిన శాస్తి చేయాలనుకుంది కాబోలు-''సరే అయితే చూస్తా, ఒక్కనిమిషం వుండండి'' అంటూ లోనికి వెళ్ళిపోయింది.

'అయ్యో పాపం! మా బోదకాలు వెంకన్న అడిగిన ఆ రెండూ యిచ్చేస్తుంది కాబోలు అమాయకురాలు, మరినాకో!' అని తపిస్తూ కళ్ళు మిటకరిస్తూ కొళాయి గట్టుపైన కూర్చున్నాను.

యింతలోనే ఆవిడ లోపలనుండి బయటకివచ్చి, ''బాబూ! మీరు అడిగినరెండూ మానాన్నగారు యెక్కడ పడేసారో కొన బడలేదుగాని, 'చీపురుదెబ్బ, చెంపపెట్టు,'

అని రెండు క్రొత్తవివున్నాయి. అవికూడా మా నాన్నగారు మొన్న తెచ్చి వుంచేరు. కావాలంటే వెంటనే తెచ్చి యిస్తాను'' అన్నది చిరునవ్వుతో.

ఆ మాటలు వింటూ వుంటే నాకు కాళ్లు వణికి పోతున్నాయి. పలాయన మంత్రం చిత్తగిస్తే బాగుంటుందేమోనను కున్నాను. నా మాటకేంగాని, మా వాడికి నిలువునా ప్రాణాలు పోయినాయంటే నమ్మండి! యేంజవాబు చెప్పడానికి నోరు ఆడకుండావుంది. యెలాగో ధైర్యం చేసుకుని, ''తల్లీ! నీదయవుంటే మేము అడిగిన రెండూ ఇయ్యి, లేకపోతే వద్దు'' అంటూ మరి వెనక్కి తిరిగి చూడకుండా చక్కా గుమ్మం మెట్లుదిగి వచ్చేడు. ''యేంరాభాయి! పండాకాయా! అన్నాను యేమీ యెరగనట్లు. ''ఓరే! పండూలేదు కాయాలేదు. 'యింకా మనం యిక్కడవుంటే చీపురు దెబ్బలు తప్పవు అంటూ నన్ను గబగబ లాక్కుపోయేడు. ఆ వెళ్ళిపోవడం డెంకాడ గుఱ్ఱాల్లాగ వెనక్కి తిరిగిచూడకుండా బొంకులదిబ్బదాకా పరుగెత్తుకుపోయేము. అక్కడ కందకంగట్టుమీద కాస్సేపు కూర్చొని వుచ్ఛ్వాస నిశ్వాసాలు తీసుకుంటేనేగాని మా ప్రాణం తెప్పిరిల్లింది కాదు. ఆ మరునాడు మేమంతా మళ్ళా డ్రిల్లుగ్రౌండులో సమావేశమై యీ రోజు నుంచి యెవరూకూడా కిటికీలలోంచి గరల్సు రూంవైపు చూడకూడదు అని తీర్మానించుకున్నాము.

—o—

గాజు తయారు చేయడానికి పనికి వచ్చే ఇసుక మద్రాసు నగరానికి సమీపంలోగల ఎన్నూరులోను, తిరువాన్కూరు – కొచ్చిన్‌లోని షెర్టల్లీలోను విరివిగావున్నట్లు కనుగొనబడింది. కలకత్తాలోని సెంట్రల్ గ్లాస్ అండ్ సిరామిక్ రిసెర్చి ఇన్స్టిట్యూటువారు ఆ ఇసుకను పరిశీలించి దానితో అనుపచ్చనిగాజు తయారు కాగలదనీ, దానిని శుద్ధిచేస్తే తెల్లటి గాజు తయారు కాగలదని, శుద్ధిచేయడానికి ఎక్కువ మొత్తం ఖర్చు కాదని పేర్కొన్నారు.

మామిడి చెట్లకు సక్రమమైన పద్ధతులలో ఎరువు కడితే ప్రతిసంవత్సరం మంచికాపు వుంటుందని, ఒక సంవత్సరం విపరీతంగా కాసి మరుసంవత్సరం బొత్తిగా కాపులేకపోవడం సంభవించదని బీహారులోని హార్టికల్చర్ సెంటర్ వారుకనుగొన్నారు.

పంజాబులోని గుర్గాన్ ప్రాంతంలో భూగర్భంలోగల ఉప్పునీటినుంచి ఉప్పును తయారుచేయడానికి అవకాశాలు గలవని జియోలాజికల్ సర్వే ఆఫ్ ఇండియావారు జరిపిన పరిశీలనలనుబట్టి తెలుస్తున్నది.

(భారత ప్రభుత్వ సమాచారశాఖ)

# కుటుంబవ్యవస్థలో వైవాహిక జీవితమునకుగల ప్రాధాన్యము

శ్రీమతి చివుకుల లక్ష్మీపున్నయ్య

కుటుంబ వ్యవస్థను మరింత పటిష్ఠంగాను, స్వయం సమృద్ధంగాను చేసికొనుటకు స్త్రీ పురుషులిద్దరు బాధ్యతాయుతంగా కృషిజరుపాలి. ఈ సందర్భమున వివాహం, కుటుంబమునకు సంబంధించిన సమస్యలపట్ల ప్రత్యేకశ్రద్ధ అత్యావసరము.

మానవుడు సహవాసి. దాని ననుసరించినవే వివాహం, కుటుంబము, సంఘము మొదలైనవి. మానవ జీవితం ఒడిదుడుకులు లేకుండా సాగాలంటే జీవితమార్గాలు క్రమబద్ధంగా నుండాలి. దాని నుద్దేశించినవే సాంఘిక కట్టుబాట్లు, ప్రభుత్వశాసనాలు. విశాల భావాలతోటి వానిని, కాలానుగుణ్యంగా తమ స్వప్రయోజనాలకు, పురోభివృద్ధికి యీ ప్రజాస్వామ్య యుగంలో రూపొందించుకోవలసిన బాధ్యత ప్రజలది.

వివాహమనేది సాంఘిక జీవితంలోని తొలిమెట్టు. అంటే స్త్రీ పురుషులిద్దరు ఒకరినొకరు గుర్తించి, పరస్పర సద్భావ, సహకారములతో అన్యోన్యంగా, కుటుంబముయొక్క పురోభివృద్ధికి తోడ్పడగలమనే అంగీకారము. ఈ సందర్భమున వారిరువురు ఒకరివలన ఒకరికి అన్యాయము, అక్రమముజరుగకుండా చూచుకొనవలసిన గురుతరమైన బాధ్యత యిరువురిపైనకలదు.

స్త్రీ పురుషుల వైవాహిక సంబంధము మానవ ప్రేరితమనండి - లేదా భగవత్ప్రేరితమనండి - అది మానవ జీవితంలో స్వభావసిద్ధమయింది. పద్ధతి ఏదైనా స్త్రీ పురుషుల స్వభావసిద్ధమైన మమకారం ఒకరిపై నొకరికి ప్రేమానురాగాలు, శ్రద్ధాసక్తులను క్రమబద్ధమైనదని ప్రకటించేది వివాహం. ఇది వారి ఉమ్మడి జీవితానికి నాందివంటిది. ఉమ్మడి జీవితంలో హక్కులు, అవకాశములు సమానమైనవని పరస్పరంగా అంగీకరించి వ్యవహరించిననాడేగాని కుటుంబశ్రేయస్సుకు దోహదము కాలేదు. అందులో ఎవరుదారితప్పినా సరిదిద్దడానికి తమకు ఆ వ్యక్తి జీవితముపైగల ప్రభావమును, సామర్థ్యమును, చాకచక్యమును వినియోగించి చక్కదిద్దకలుగాలి. దానికి తోడు సాంఘిక కట్టుబాట్లు, ప్రభుత్వ శాసనాలు మానవకుటుంబ జీవితాన్ని క్రమబద్ధంగాను, అభ్యుదయమార్గాలలోను నడిపించడానికి అనువుగా కాలానుగుణ్యంగా రూపొందాలి. వీని అర్థముచేసికొనిన స్త్రీ పురుషులు ఆదర్శనీయమయిన దంపతులు కాగలుగుతారు.

అయితే యీ విడాకుల సమస్య ఎక్కడ-ఎందుకు వస్తుందనవచ్చును - ఇందుకు అనేక కారణములుండవచ్చును; కాని తమ విలాసాన్ని, నిరంకుశత్వాన్ని ఆధారంచేసికొని విడాకులుకోరి పుచ్చుకోడం మాత్రం కుటుంబవ్యవస్థ పటిష్టంచేయడానికి దోహదము కాజాలదు.

బాల్య వివాహాలవలన ఊహతెలిసిన తరువాత భార్య భర్తకు నచ్చకనో లేక భర్తకు భార్య నచ్చకనో విడాకుల సమస్య ఉత్పన్నము కావచ్చును. వివాహానంతరము కొంతకాలమునకు వ్యాధిగ్రస్తులుగానో, అనాకారులుగానో మారిపోయినప్పుడు, లేదా వారిరువురిలో ఒకరి ప్రవర్తన మరియొకరి కంగీకారము కాకపోయినప్పుడు, లేదా యిరువురిలో నెవరైనా నైతికంగా పతనంచెంది అన్యాయం, అపకారంచేయ తలపెట్టినప్పుడు విడాకులసమస్య పొడచూపును.

ఈ లోపాలను సరిదిద్దాలనే ప్రయత్న ఫలితంగానే బాల్య వివాహాల నరికట్టడానికి వివాహవయస్సు స్త్రీ పురుషుల యిరువురకు పెంచబడింది. అంతేకాక పురుషుడు తను కుటుంబపోషణ కవసరమగు ఆర్జన నుపక్రమించిననేకాని వివాహమాడరాదనేది కుటుంబ ఆర్థికస్థిమితాన్ని బలపరచడాని కుద్దేశించినది. బాల్య వివాహాల నరికట్టడం మూలంగా యువతీ యువకులు యుక్తవయస్సులో తమ అభిరుచుల ననుసరించి, తమ పురోభివృద్ధికి కారకులగు తల్లిదండ్రుల పర్యవేక్షణక్రింద వివాహం చేసికొనడానికి అవకాశము లేర్పడినవి; కాబట్టి విడాకుల కవకాశం కొంత సన్నగిలింది.

ఇక వివాహానంతరము వచ్చేపరిణామాల ఫలితంగా అనాకారులై, వ్యాధిగ్రస్తులైన యువకులకు యువతులు, యువతులకు యువకులు విడాకులివ్వడం, పుచ్చుకోడం అవసరమే అయినా బాగా పరిశీలించవలసిన విషయం. ఈ సందర్భమున విడాకులుకోరేపక్షంలో పరస్పర సానుభూతితో యిందులో భార్యాభర్త లిరువురికి అన్యాయము జరుగకుండా జరుగడం వాంఛనీయం.

ఇక భార్యాభర్త లిరువురిలో నొకరి ప్రవర్తన మరొకరికి నచ్చకనో, లేక నీతినియమాలుతప్పి తనకు అన్యాయము, అక్రమము తలపెట్టబడిందనే సాకుతో విడాకులుపొంద ప్రయత్నించడమునకు ఆధారము లుండాలి. అది వాస్తవమైనా, భార్య తన ప్రభావముతో భర్తనుకాని, భర్త తన ప్రభావముతో భార్యనుగాని వాస్తవిక పరిస్థితుల దృష్ట్యా సక్రమ మార్గంలోకి తేకలుగడం వాంఛనీయము. అది ఫలించనినాడు సయితం విడాకులు పొందినవారు, యిచ్చిన వారుకూడ సంఘములో నైతిస్థాయిన పెరుగుదలకు వినియోగపడాలికాని, పతనానికి వినియోగపడటం సహించరానిది.

ఇక కుటుంబ ఆస్థిపాస్తులను గురించి స్త్రీలు సమాన అవకాశములను కోరుటలో ఆందోళనకు కారణమేమిటో అర్థముకావడములేదు. ఆడ, మగ అనే విచక్షణలేకుండా బిడ్డలకు చదువు చెప్పించి, పెళ్ళిళ్ళుచేసి, మిగతాయున్న ఆస్థిపాస్తులను సమానంగా తండ్రి కూతుళ్ళకు, కొడుకులకు పంచియివ్వాలి. కాని కుమార్తెల కిచ్చిందైనా, కుమారుల కిచ్చినదైనా వారివారి కుటుంబమునకు చెందేలాగుండాలి. దీని మూలంగా అత్తగారి యింటివైపు ఆస్థిపాస్తులులేని వితంతువులులాంటి నిరాధారులకు చాలమేలు కలుగును,

పైగా కుటుంబ ఆర్థికస్థిమితం పటిష్టంకావాలంటే అందులోని ప్రతియొక్కరు దాని అభివృద్ధికి తోడ్పడాలి. అంటే తమ అవసరాలమేరకు ఆదాయం పెరిగేదానికి కృషిజరుగాలి. ఒకరు సంపాదించిపెడ్తే ఒక కుటుంబములోని పదిమంది కూర్చొని తినే పద్ధతి పోవాలి. అది పోయిననాడుగాని ఉమ్మడి శ్రేయస్సుకు అవకాశాలు మెరుగుకాలేవు.

కుటుంబ ఆర్థికస్థిమితము మెరుగులు తీరిననాడు సంఘంలో ప్రతియొక్కరు గౌరవంగా జీవయాత్ర సాగిస్తారు. తమకు, తమ బాల బాలికలకు ఆరోగ్య వసతులు, విద్య, విజ్ఞాన, వినోదవసతులకు అవకాశములు విస్తృతంకాగలవు. ప్రతియొక్క మానవుడు చేయడానికి పని, చేసినపనికి తగినఫలితము లభ్యములయినప్పుడు యీ నాటి సంక్షోభము చల్లారుతుందనే నమ్ముదాము !

---

## విజ్ఞప్తి

“వివాహ, ఉత్సవాలలో భోగం మేళాలనిషేధం” అనే శీర్షికక్రింద అనుకూల, ప్రతికూల అభిప్రాయాలతో కూడిన క్లుప్తమైన వ్యాసాలను మా పాఠకలోకంనుండి ఆహ్వానిస్తున్నాము.

సంపాదకుడు

# పరివర్తన

శ్రీ పిళ్లా సుబ్బారావు శాస్త్రి

రామారావుగారు సామాన్య కుటుంబీకులు. ఆయనకి ముగ్గురు మగపిల్లలు. ఆయన భార్య రంగమ్మ. రంగమ్మ రామారావుగారెంత నెమ్మదిగల మనుషులో అంత గయ్యాలి మనిషి! రామారావుగారి జీతం నూరు రూపాయిలు. ఆ నూరు రూపాయల్లో ముప్పైరూపాయిలు యింటి అద్దికే పోతుంది ...! పోనీ ముప్పైరూపాయిలు పోతేపోయినై! ఇల్లు బాగుందా అంటే అదీ లేదు....! - వర్షంవచ్చిందంటే చాలు యిల్లంతా వరదయి పోతుంది. పోనీ బాగు చేయించమని అందామా అంటే "ఖాళీ చెయ్యండి! మీరు కాకపోతే మరొకరు! !" అంటాడు యింటిగలాయన! ఆ పట్టణంలో 30 రూపాయిల్లో యిల్లు దొరకడమే కష్టం! రామారావుగారెలాగో తికమకపడుతూ సంసారాన్ని యీడ్చుకొస్తున్నారు.

రామారావుగారు ప్రొద్దుట ఆరుగంటలకి కాఫీ నీళ్లు పోసుకు వెళ్లారంటే, తిరిగి రాత్రి పదిగంటలకే యింటికి వస్తారు - ఆ ఘడియకాలం భార్య అదిలేదని, యిది లేదని వేపుకుతింటుంది... ! ఏమయినా గట్టిగా అంటే "పుట్టింటికి వెళ్లిపోతాను!" అని భయపెడుతుంది.

రంగమ్మ తండ్రి కొంచెం ఆస్థిపరుడు. ఆయనకి ఇద్దరే యిద్దరుపిల్లలు. ఒకమగపిల్లాడు, ఒకఆడపిల్ల. (రంగమ్మ) తండ్రి ముసలాడవడంమూలాన తనకున్న ఆస్థిని పిల్లలకి పంచి పెట్టాడు. రంగమ్మ గర్వానికి, మాటాడితే పుట్టింటికి వెళ్తానని జడిపించటానికి ఆస్తే కారణం... !

రోజూ రంగమ్మ దేనికోదానికి కయ్యం పెట్టుకుంటుంది...! పోనీ "పోతే పో" అందామా అంటే తాను ప్రొద్దుటపోతే రాత్రివస్తాడుకదా, పిల్లలగతేంకావాలి? ముఖ్యంగా పాలుత్రాగే చంటిపిల్లాడిగతేం కావాలి? అతను ఇంతవరకూ ఓపిక పట్టడానికి యిదే కారణం.

ఒక రోజు రాత్రి యీమె బాధపడలేక "చచ్చిపోతా"నంటూ పయనమయ్యాడు

"ఇదో! మీరు చచ్చిపోతానని నన్ను మాత్రం బెదరించకండి...! మీరు చస్తే హాయిగా బ్రతుకుతాను....!! నాకు ఆస్థి వుంది !!! - కానీ మీకంటే ముందు నేనే పోతున్నాను! పిల్లల్నిచూసుకోండి!" అంటూ తనబట్టలు సర్దుకు ప్రయాణమయింది రంగమ్మ.

భార్యభర్తల తగువులమధ్య నలిగిపోతున్నారు. పసిపిల్లలు....! మాతృహృదయం కంటే యిక్కడ పితృహృదయమే పిల్లల కోసం వెనక్కువచ్చింది!-అవును! ఆబిడ్డలు

నిజంగా రంగమ్మ కడుపునకన్న బిడ్డలయితే అలా అనకేపోవును...! కాని, వారు మొదటి భార్య బిడ్డలు...! ఆమె చచ్చిపోవడంమూలాన్నే యీామెను చేసుకోవాల్సివచ్చింది! ఆనాడు యిలాఅవుతుందనుకోలేదతను! పాపం!

తిరిగి రామారావుగారు భార్య కాళ్ళు పట్టుకోవాల్సి వచ్చింది....! బ్రతిమలాడుతూ తీసుకువచ్చాడు...!

ఒకనాడు భర్తని యాభై రూపాయలడిగింది రంగమ్మ...!

"ఎందుకూ...!" అని అడిగాడు భర్త

"ఎందుకేమిటి...? మన ప్రక్కింటి సీతమ్మ సిల్కుచీరకొనుక్కుంది...! నేను కూడా కొనుక్కోవాలి...!" అంది రంగమ్మ.

"బాగుంది...! 'గోదావరి పారిందని గొడ్డలేరుపారిందట'! అలాగే ప్రక్కింటి మేనేజరుగారి భార్య కొనుక్కుంటే, నువ్వో లాకొనుక్కుంటావే...! - నా దగ్గర యాభై దమ్మిడీలుకూడా లేవు...!" అని కసిరి కొట్టారు రామారావుగారు.

"లేవూ...? అయితే మానాన్న దగ్గరకి పోతున్నాను...!.మీారేం చస్తారో చావండి!!" అంటూ తయారయింది.

రామారావుగారు దూరం ఆలోచించారు - "సరే! పోతేపో..!" అంటూ బండి పిలిచికూడా పంపేశారు.

మొదటి పిల్లలు యిద్దరూ జ్ఞానంవచ్చినవారవడంమూలాన అన్నిపనులు హాయిగా చేసుకుంటున్నారు. ఒకపూట అన్నవంట వండితే, రెండోపూట తమ్ముడు వంట వండేవాడు...! - ఇలా కొద్దిరోజుల్లో, చదువుతోపాటు యిదికూడా అలవాటయిపోయింది. అంతా హాయిగా, శాంతంగా వుంటున్నారు.

రంగమ్మ వెళ్లిన దగ్గర్నుండీ, భర్త రామారావుగారి జీతంకూడా ఎందుకో కొంచెం పెంచారు. - ఇలా ఆరునెల్లు గడిచాయి...!

ఇకరంగమ్మ తన ఆస్థితో హాయిగా వుంటోంది!-రంగమ్మ దగ్గరకి నలుగురూ పోగయ్యారు...! - ఆమె తన ఆస్థితో ఓవ్యాపారం పెట్టాలనుకుంది...! - కొంత మంది బట్టలకొట్టు పెట్టమని, మరి కొందరు మరొకటని ఏవేవో చెప్పారు...

చివరికి రంగమ్మ నల్లమందు, సారాయి వ్యాపారం ప్రారంభించింది...! - ఇలా లాభాలమీాద లాభాలు పొందుతోంది! దొంగతనం ఎన్నాళ్లుదాగుతుంది? ఒకనాడు దొరికిపోయింది!! వున్న ఆస్థి అంతా వూడ్చుకుపోయింది...! - కొంత అప్పు కూడాచేసి, తన జైలు శిక్ష తప్పించుకోవల్సి వచ్చింది!

ఎవరింటికి వెళ్లినా ఒకరోజు రెండు రోజులు తప్ప బ్రతికినంతకాలం పోషిస్తారా? కొంతమందయితే తిట్టారు...!

తండ్రేమో "ఆస్తిని తగలబెట్టడమే కాకుండా, నన్ను తలెత్తుకోలేకుండా చేశావు...!" అంటూ తిట్టి భర్తనే వేడుకోమని పంపేశాడు.

"మొగుడుండగా నీకేం పోయ్యే కాలమే!" అన్నారు ఆనాటి బంధువులు!

రంగమ్మకి పూర్తిగా బుద్ధివచ్చింది. స్త్రీకి భర్తకంటె వేరే ఆస్తిలేదని గ్రహించింది.

"నన్ను క్షమించండి! ఆస్తివుందని మిమ్మల్నేవో అన్నాను..! నాకు పూర్తిగా లోకం అంటే ఏమిటో అర్థమయింది! – స్త్రీకి ఆస్తి భర్తే!" అంటూ రామారావుగారి కాళ్లమీద పడింది రంగమ్మ.

రామారావుగారు భార్యలో కలిగిన మార్పుకి చాల సంతోషించాడు! రంగమ్మ పిల్లల్ని కన్నబిడ్డల్లాగ చూచుకొంటూ హాయిగా కాలంగడిపింది.






## ఉసిరికాయల పచ్చడి (నూతనపద్ధతి)

ఉసిరికాయలు $1\frac{1}{2}$ సేర్లు శుభ్రముగా కడిగి తడిలేకుండా ఆరబెట్టవలెను. మిరపకాయలు $\frac{3}{4}$ శేరు, ఒకతులం యింగువ, ఆవాలు మెంతులు కలిపి $\frac{1}{2}$ సోల, దోరగా వేయించి పొడిచేసికొని యుంచుకొనవలెను. తరువాత ఒకపాత్రలో 3 సోలల నూనెపోసి కొంచెము కాగిన తరువాత ఉసిరికాయలు పోసి మూత పెట్టవలెను. అవిమెత్తగా ఉడికిన తరువాత మెత్తగా నూరిన మూడు సోలల ఉప్పు, చేసిపెట్టుకొనియున్న కారపొడి అందులో వేసి బాగా కలిపి జాడీలో నిల్వయించుకొని రెండు మూడురోజులు గడిచినప్పటి నుండి వాడినచో మాగాయవలె రుచిగానుండును.

## సేవా

$\frac{1}{2}$ శేరు బియ్యం నీళ్లలో పోసి, నానినతరువాత వడియవేసి పిండికొట్టి పెట్టుకొనవలెను. దానికి తగు మాత్రం వుప్పు నూరినదివేసి కొంచెము పొయ్యిమీద బాణలిపెట్టి వేడిగావుండేదాక వేయించి దించిపెట్టుకొనవలెను. పొయ్యిమీద ఇడ్లీపాత్రపెట్టి 1 పావు నీళ్లుపోసి, అవి తెర్లువచ్చినప్పుడు ఇడ్లీరేకువేసి దాని మీద తెల్లని గుడ్డపరచి, ఆ వేయించిన పిండిని కొంచెము కొంచెముగా చన్నీళ్లుపోసి ముద్దగా కలిపి, ఓం పొడి చిల్లల్లో వేసి ఆ గుడ్డమీద పిండి మూతపెట్టేది. అది ఆవిరికి 3 నిమిషములలో వుడుకును. దానిని తీసి గిన్నెలోవేసుకొని అంత పిండిని అట్లా నేచేసి వుంచవలెను. కొంచెము గరిటెతో కదిలించిన ఆ సేవా చిన్న చిన్న ముక్కలగును. దానిని అలావుంచి, ఒకబాణలిలో 2 ఫలముల చమురుపోసి పొయిమీద పెట్టవలెను. దానిలో 2 ఎండుమిరపకాయలు వేసి, 1 స్పూను మినపప్పు, $1\frac{1}{2}$ స్పూను ఆవాలు వేసి వేయించేది. అందులోనే కొంచెము ఇంగువ వేసి తీసిపెట్టుకొనేది. అందులో పచ్చికరివేపాకు 2 రెవట్లు, 1 ఫలం జీడిపప్పువేసి, వేగిన తరువాత తయారుచేసివుంచిన సేవా తీసుకొని అందులోవేసి కలియపెట్టవలెను. దానిపైన చిటికెడు పసుపు వేసి ఇంగువపొడిచేసి వేయవలెను. నిమ్మపండుపిండి, కలియపెట్టి దించవలెను. ఇదితినుటకుచాల బాగుండును. పులిహారవలెవుండును.

ఎ. కనకం

## అప్పాలు

మైదాపిండి $\frac{1}{4}$వీసె, రెండు పెద్ద అరటిపండ్ల ముక్కలను, కొంచముపాలు, రెండుచంచాల చక్కెర ఒకటిగాకలిపి జారుగానుండునట్లు చేయవలెను. అందులో చిటికెడు ఉప్పు, సువాసనకు జాజికాయ పొడినివేసి కలిపి నేతిలోగాని, డాల్డాలోగాని, పప్పునూనెలోగాని ఉడికించి గోధుమ వర్ణముగా వేయించిన చాల రుచికరముగా తయారగును.

సి. లక్ష్మీప్రసన్నయ్య

# ఆశాలత

శ్రీ చల్లా లక్ష్మీనరసింహశాస్త్రి

ఆశాలతాతన్వి
అవతరించేదాక
అరుగుచుండును మనసు
ఆకాశవీధిలో !

ఊహాసముద్రాన
ఉద్భవించినలక్ష్మి
ఊగిపోయే హృదిని
ఉండిచూచేదాక !

అరుగుచుండును మనసు
ఆకాశవీధిలో !

కుసుమ కోమలి నన్ను
కోరివలచేదాక
కువలయేశ్వరినన్ను
కూర్మిచేరేదాక !

అరుగుచుండును ... ...

నిత్య సత్యాన్వేష
నిర్మలాత్మలలోన
నిలిచిపలికే జ్యోతి
కలిసిపాడేదాక !

అరుగుచుండును మనసు
ఆకాశవీధిలో !

# మారని మనసులు

శ్రీ కావుటూరు వెంకటనారాయణరావు

అతను ఆ మండపంలో అడుగుబెట్టి యెన్నిరోజులయిందో యెవ్వరికీ తెలియదు. కానీ అతను ఆ వూరివాడుగాదని అందరికీ తెలుసు. అతను ముందు యేవృత్తితో జీవించేవాడో యెవ్వరికీ తెలియదు. కానీ యిప్పుడు అడుక్కుని జీవిస్తున్నాడు. అతనికి కన్నవారుగానీ, వున్నవారుగానీ యెవరన్నావుండే వారేమో యెవ్వరికీ తెలియదు. కానీ యిప్పుడతను యేకాకని అందరికీ తెలుసు. ముందతనికి యేమన్నా ఆస్తిపాస్తులుండేవేమో యెవ్వరికీ తెలియదు. కానీ యిప్పుడతని ఆస్తంతా ఆ చింపిగుడ్డల మూటని అందరికీ తెలుసు. ముందతనెలావుండేవాడో యెవ్వరికీ తెలియదు. కానీ యిప్పుడతను సర్వరోగాలతో అల్లాడుతున్నాడని అందరికీ తెలుసు. ఇప్పుడతనిని గుఱించి అందరికీ తెలుసు. అతనిపేరు యెవ్వరికీ సరిగా తెలియకపోయినా కుష్టురోగని అందరూ పిలుస్తారు. కానీ తెలియని దొక్కటే! అతని మనసు! అతని మనసు తాకితే కరగిపోయే వెన్నలాంటిదో లేక తరతరాలకు కరగని కఠినశిలలాంటిదో యెవ్వరికీ తెలియదు.

అతను తలదాచుకుంటున్న మండపం యేమంత పెద్దదిగూడాకాదు. అది మూడు రోడ్లు గలిసేచోట ఓమూల కొండరాతితో నిర్మించబడింది. అందుకనే ఆ కుష్టురోగి దాన్ని తన స్థిరనివాసంగా యేర్పరచుకున్నాడు. అందులో ఓమూల అతను అన్నంతినే అటిక బోర్లించివుంది. మరోమూల అతని చింపిగుడ్డల మూట దానిమీద చింకిచాప వున్నాయి. అవి వచ్చేపోయే బండ్లవలన చెలరేగిన దుమ్ముతో నిండి వున్నాయి.

అతను గోధుమవర్ణంలో వుంటాడు. దగ్గర దగ్గర డెబ్భయికి పైబడ్డ ముసలివాడు. తను పూర్వం కష్టమెరిగినవాడని తెలుపడానికి కామోసు, అతని కండలు జారియున్నాయి. తలంతా నెరసివుంది. యేరోగంవల్లనో తల వెంట్రుకలన్నీ వూడి, మిగిలినవి తెల్లగా, టెంకాయపీచులలా తిరిగి చూడడానికి వికృతంగా వున్నాయి. మొహమంతా పెద్దమ్మ మచ్చలతో నిండివుంది. ఒక కన్ను యెప్పుడూ నీళ్ళుగారుతూ వుంటుంది. పళ్ళచిగుళ్లు నల్లబడి బయటకు తొంగిచూస్తున్నాయి. చేతులనిండా కురుపులు - వాటిచుట్టూ మూగే ఈగలు - అతని శరీరమంతా కుష్టురోగంతో ముడుతలుపడివుంది. ఒక కాలు యేనుగుకాలు. అతని జీవితంలో యెప్పుడో పక్షవాతంవచ్చి చేతులు స్వాధీనముతప్పాయి. అతని వికృతాకారంచూస్తే భయం కలుగుతుంది. అతని శరీరస్థితిచూస్తే అసహ్యమేస్తుంది. అందుకనే అతన్ని యెవ్వరూ సమీపించరు. ఆఖరుకు అతనితోటివారుగూడా - అంటే అడుక్కునే యితరబీదలు, - కుంటి, గ్రుడ్డివారుగూడా అతన్ని చూచినప్పుడు అసహ్యించుకుంటారు. అందువల్లనే ఆ మండపం అతనొక్కడితోనే నిలచిపోయింది. లేకపోతే యింకెందరో దానిలో స్థిరనివాసం యేర్పరచుకునేవారు.

అతను తన జీవితాన్నంతా గజదొంగతనంతో, అందరినీ హింసిస్తూ గడిపేవాడట. ఆ వృత్తితోనే జైలు జీవితం అనుభవించి, తుదకు ఆ పాపపరిహారంగా యీ జన్మలోనే యిలా అన్యాయమయ్యాడని అందరూ చెప్తారు. కానీ ఆ మాటలు చెప్పేవారికే వాటి నిజానిజాలు తెలియవు. కఠినాత్ముడు, అదృష్టహీనుడు, తుచ్ఛుడు, నీచుడు ఇవి అతనికి సంబోధన పదాలు.

అతను యెవ్వరితో పలుకడు. ఆ మండపం ముందు గుడ్డపరచుకుని యెవరన్నా దయదలచి ఓ కాసు పడవేస్తారేమోనని వచ్చేపోయే జనంతట్టు ఆశతో చూస్తుంటాడు. కానీ రోజూ ఓ పావలా డబ్బులు రావడమే మహాకష్టం. ఆ కుష్టురోగిని దయతలచి యేకుహోటల్లో అతని అటికలో యెండిన మెతుకులు నాలుగు రాలుస్తుంది. వాటినే అతడు తిని జీవయాత్ర సాగిస్తాడు.

అతని కన్నేండ్లువచ్చి అన్ని రోగాలతో బాధ పడుతున్నప్పటికి చెవులకు యేజబ్బురాలేదు. ఎంత సన్నని గొంతైనా విని అర్థంచేసుకోగలడు. అతన్ని చూచి అందరనుకునే మాటలు వింటాడు. ఆ మాటలు విన్నప్పుడల్లా అతని కంటిలో సాధారణంగా కారుతున్న నీరు ప్రవాహంలా మారుతుంది. ఆ మాటలు విని యెందుకో ఆ మాటలన్నవారికేట్టు జాలిగా చూస్తాడు.

ఆ నాడు ఆదివారం. బజార్లో అంగళ్లన్నీ మూసి వున్నాయి. దిక్కులేని బీదపిల్లలు ఆ అంగళ్ల ముందు పడి బస్తాసందులనుండి రాలిన ధాన్యాన్ని యేరుక తింటున్నారు. ఆ నాడు వారిని అడ్డుపెట్టే వారెవ్వరూ వుండరు. ఇతర రోజులలో నయితే కొట్టు యజమాని వారిని ఆమడదూరం పంపందీ వదలడు. వారితో పాటు ఓ రెండుమూడు కుక్కలుకూడా వున్నాయి.

ఆ కుష్టురోగి ఆనాడుగూడా తన మండపంనుండి కదలలేదు. సాయంత్రం మూడుగంటలైనప్పటికీ అతని అటికలో ఒక్క చెడినకాసుగానీ, ఒక్క యెండిన మెతుకుగానీ పడలేదు. అందుకతనికి విచారంగూడా వున్నట్లులేదు.

సాయంత్రం నాలుగుగంటలయింది. పెద్దాసుపత్రికి ఆవులను పాలుపిండడానికి మందగా తోలుకు పోతున్నారు. పిల్లలు ఆ వీధినడుమ యెగురుతున్నారు. వచ్చే కార్లు, పోయేకార్లు, బండ్లు, రిక్షాలు, సైకిళ్లు ఆ పిల్లలను చూడకుండా తమ వేగంతో తాము పోతున్నాయి. ఎందుకనో ఆవులమంద సాగిపోతున్నది నిలచిపోయింది. ఆ మందను తోలేవాడు గూడా దూరంగా కట్టెపట్టుకుని నిలబడివున్నాడు. మందలో రెండు ఆవులు తీవ్రంగా పోట్లాడుతున్నాయి. ఆ పోరాటంలో ఒక ఆవు గెలిచింది. రెండో ఆవు దిక్కుతోచక పరుగెత్త మొదలుబెట్టింది. దాన్ని ఆపడానికి వాటిని తోలేవాడితరంకాలేదు.

ఆ కుష్టురోగి ఇదంతా చూస్తున్నాడు. ఆ ఆవు ముందు కాళ్లతో, వెనుక కాళ్లతో నేలను తంతున్నాది. మెల్లగ ఆ కుష్టురోగిలేచి దానిదగ్గర ఓ ప్రక్కగా నిలబడ్డాడు. దాన్నిచూచి కొందరు పిల్లలు, భయపడుతున్నారు. కొందరు ఆ వింత చూస్తున్నారు. మరల ఆ ఆవు తన మండపంతట్టు పరిగెత్తి నేరుగా వెళ్ళిపోయింది. దాన్ని తరుముకుంటూ తోలేవాడుగూడా పరుగెత్తాడు. ఆ కుష్టురోగి తిరిగి తన మండపంలోకివచ్చి కూర్చున్నాడు.

ఓ అరగంట దాటిపోయింది. ఇంతలో ఆ కుష్టురోగి యెదురుగా ఓ ఫర్లాంగు దూరంలో మునుపటి ఆవే శిరమెత్తిన ఖడ్గమృగంలా వగర్చుకుంటూ, దెబ్బతిన్న పాములా బుసలుకొడుతూ పరిగెత్తి రావడం చూచాడు. ఇంకొక క్షణంలో అది తన మండపం దాటిపోతుంది. ఇంతలో తనమండపం యెదుటి సందులోనుండి ఓ నాలుగేళ్ళపాప టిక్కు టక్కు బండి లాక్కుంటూ నడివీధిలోకి పరుగెత్తుకవచ్చింది. ఆ పాపకు అచటి పరిస్థితులెలా తెలియగలవు? ఇంకొక క్షణంలో ఆ పాప ఆ ఆవు కాళ్లక్రిందపడి నలిగిపోతుంది. ఆ కుష్టురోగి యేమాలోచించాడో యేమో వెంటనే నడిరోడ్డుకి వెళ్ళాడు. ఆ ఆవు తనను సమీపించింది. ఇక రెప్పపాటులో తనూ, ఆ నాలుగేళ్లపాప నాశనమవుతారు. తన చేతులు స్వాధీనంలోలేవు, ఆ పాపను అమాంతం కౌగలించుకున్నాడు. బజారులో అందరున్నప్పటికి యెవరి రక్షణలో వారున్నారు. కానీ ఆ పసిపాప సంగతి ఆలోచించిన వారొక్కరులేరు. ఇంతలో ఆ ఆవు తన రెండు కొమ్ములతో, నెత్తితో అతని పిర్రలమీద కుమ్మింది. ఆ పసిపాప, అతను, మండపం ముందర బోర్లపడ్డారు. కాని ఆ పసిపాపకు యే దెబ్బా తగులలేదు. ఆ పసిపాప అతని హృదయ పీఠంలో హత్తుకొనిపోయింది.

అతని చేతులు దోక్కుపోయాయి. పిర్రలు అదిరి పోయాయి. నడుమిరిగినంత పనయింది. కానీ రక్తం రాలేదు. ఇంకా ఆ పసిపాప అతని హృదయాన్నే అంటిపెట్టుకొనివుంది. ఆ లేత హృదయానికి ఆనందం కన్న యెక్కువేంకావాలి? ఆ పసిహృదయానికి వీధిన ఆ ఆవు అలా శివమెత్తి పరుగెత్తుతున్నాదని యేం తెలుసు?

అతను మెల్లగా లేచాడు. బాధతో కన్నీరు కార్చాడు. ఆ పాపను తన మండపంమీద కూర్చో బెట్టాడు. అతనిచుట్టూ కొందరు చేరారు. కొందరు అతని ధైర్యాన్ని పొగిడారు. కొందరు ఆ బిడ్డను తాకినదానికి అసహ్యించుకున్నారు. కానీ అతని బాధను పరామర్శించిన వాడొక్కడూ లేడు. వారిలో మానవత్వం నశించిందేమో! సంఘంలో జీవించ డానికి సహకారం కావాలి. ఒకరినొకరు, ఒకరి కష్టాల నొకరు అర్థంచేసుకొని, అనురాగంతో అన్యా యాన్ని దూరంచేసినపుడు సంఘమే స్వర్గంకాగలదు. కానీ వారి ఆ అనురాగం యేకోశానా లేదే! అయి పోయింది వారి విచారణ. మరలా యెవరికి వారయి పోయారు.

అతను ఆ పాపను ముద్దుపెట్టుకున్నాడు. అతని శరీర అపరిశుభ్రతకు ఆ పాపముఖం చిట్లించుకుంది.

అతను యిన్నిరోజులకు ఓ శరీరాన్ని తాకగలి గాడు, యెన్ని రోజులో అతనికే లెక్కలేదు.

"యేం పాపా! దెబ్బ తగిలిందా" అని అడిగా డతను.

ఆ పాప అమాయకంగా లేదని తలవూపింది. తన బండితట్టు చూస్తుందాపాప. కాని తనిప్పుడు తెచ్చివ్వ లేడు. అది మురుగుకాలువలోపడి తడిసిపోయింది.

"యేంపాపా! బండికావాలా?" అని అడి గాడు. అవునని తలవూపిందాపాప.

"అయితే రేపు కొనిస్తాలేమ్మా" అన్నాడతను.

"అయితే ... నిజంగా కొనిత్తావా తాతా!" అని వచ్చీరాని మాటలతో అడిగింది పాప.

అతని ఆనందం గంగాప్రవాహంలా గట్లు తెంపు కుంది. తన్నింతవరకు ఆ విధంగా అడిగిన వారెవ్వరూ లేరు. నిజంగా తను వేరొకబండి కొనివ్వగలడా? లేకేం తనొకపూట తిండిమానుకుంటేసరి!

"నిజంగానమ్మా! ... రేపేకొనిస్తాగా"

"అయితే నాకు మా తాతను చూపించవూ తాతా" అని అడిగింది.

"నేనున్నానుగాదమ్మా"

"నీవుగాదు తాతా! ఆకాశంలోనితాత" తని ప్పుడు ఆ అమ్మాయి నెత్తుకొని పశ్చిమంలో గ్రుంగు తున్న భాస్కరరాగ రంజితబింబాన్ని చూపాలి. కానీ అతనాపని చేయలేడు.

"లేదులేమ్మా. రేపుచూపుతాగా. మరి నీకు మీ మామయ్యను చూపుతాగా చీకటిపడితే"

"చీకటిపడితే మా అమ్మ దగ్గరికి పోవాలి తాతయ్యా. లేకపోతే మా అమ్మ కొడుతుంది."

ఇంతలో ఆ బిడ్డతల్లి "పద్మా! పద్మా!" అంటూ కేక వేసుకుంటూ వచ్చింది.

"అమ్మా! నేనిక్కడున్నానే. తాతే బొమ్మ కొనిస్తాడట" అని గంతులేస్తూ చెప్పింది. ఆ సమ యాన ప్రక్కనే ఆ కుష్టురోగి నిలబడివున్నాడు. ఆ తల్లి అమాంతం తన బిడ్డను చంక నిరుకించుకుని "ఓరి పాపిష్టి ముండాకొడకా! కుష్టురోగంతో ఈ పసికందును తాకడానికి నీకెలా చేతులాడాయిరా - దరిద్రపు పీనుగా! రా అమ్మా నీకు దిష్టితీస్తా"నంటూ ఆ సందులో వెళ్ళిపోయింది.

నిజమే! తను తాకితే దేనికైనా దిష్టి తీయా ల్సిందే! ఈ మానవజాతి వూరుకుంటుందా? తనలో యేముంది? తననుచూస్తే పిల్లిని చూచినట్లు తిట్టుకుంటారు. తను సమాజానికి శత్రువు. తన జీవితంలో సమాజానికి సౌఖ్యం అభిలషించినా అది తనను కాలితో త్రోసివేస్తుంది.

అతను అది మొదలు నిలకడగా ఒక్క క్షణం నిలకడగా వుండియెరుగడు. యెప్పుడూ కాలుగాలిన పిల్లిలా - వీధులన్నీ తిరుగుతూవుంటాడు. ఆ ప్రక్క రోజూ ఒక పావలా, తనొక రోజు అడుక్కోగా వచ్చింది, ఖర్చుపెట్టి ఓచెక్కబండి కొని తన చింపి గుడ్డలమూటలో దాచాడు. కానీ, తనెవరికైతే ఆ

బండి నివ్వాలనుకున్నాడో ఆ పాప యింతవరకు అగుపించలేదు.

వర్షాకాలం వచ్చినట్లేపోయింది. యెండలు మెల్లమెల్లగా ముదిరి ఆ యేడు మరీ తీవ్రమయ్యాయి. ఊరిలో రోజుకొక అగ్ని ప్రమాదం సంభవిస్తుండేది. పూరిపాకలుగలవారు బహు జాగ్రతతో కాలం వెళ్ళబుచ్చుతున్నారు.

అతను నివసించే యెదురు సందంతా మూడుపాళ్లు పూరిపాకలతో నిండివుంది. ఆ సందుదాటితే యేటి రేవు చేరవచ్చు. ఆ తట్టు అందరూ నీళ్ళకోసం రేవుకు ముఖ్యంగా యెండాకాలంలో వెళ్ళడం సహజం.

అతను వూరంతా తిరిగి సాయంత్రమయ్యేటప్పటికి తన మండపం చేరుకున్నాడు. భానుడు మెల్లమెల్లగా పడమటి కొండలలో గ్రుంకుతున్నాడు. అతని ప్రతిబింబం నీటి రేవులో కమనీయంగా మెరుస్తున్నాది. నీళ్ళకోసం కుండలతో, కొందరుపోతున్నారు. నీటి కుండలతో కొందరు తిరిగివస్తున్నారు.

అతను ఆకాశంతట్టు చూస్తూ యేదో ఆలోచిస్తున్నాడు. మధ్య మధ్య నవ్వుకుంటున్నాడు. ఇంతలో కొంపలంటుకున్నాయని యెవరో అరుస్తూ పరుగెత్తుతున్నారు. ఆ మాటలు కొందరు నమ్మారు. కొందరు నమ్మలేదు. అతను మెల్లగాలేచి యెదురు సందు తట్టు చూచాడు. దూరాన మంటలు, ఆ మసక చీకటిలో స్పష్టంగా కనుపించాయి. తన కాళ్ళలో సత్తువనంతా కేంద్రీకరించి త్వరగా ఆ ప్రదేశానికి చేరుకున్నాడు. ఇంతలోనే ఆ మంటలు, ఆ సందులోని పూరిపాకల నన్నిటిని దహించివేస్తున్నాయి. తను చూస్తూ నిలుచుకున్నాడు. తనేం చేయగలడు? అగ్నికి ఆహుతి అవుతున్న ఆ గృహాలనుండి వస్తువులు బయటకులాగివేయలేడు. తన చేతులు తన స్వాధీనంలోలేవు. కానీ ఆ పాపను తను జవిరి తన హృదయంలో యిమిడ్చుకున్నపుడు ఆ శక్తి తన చేతులది కాదనుకున్నాడతను. ఆ సంగతి తలుచుకొన్నపుడు అతను యెందుకో ఆ యిండ్లన్నింటినీ గాలించసాగాడు. అతనికేమగుపడుతుంది? అన్నీ దగ్ధమవుతున్నాయి.

ఆ పూరి పాకలలో నివసించే యేకాకులు, తామెక్కడో, యేబజార్లోనో యేనీటిరేవులోనో వున్నపుడు, తమ పాకలు అగ్నిదేవునికి ఆహుతి అవుతున్నాయంటే విని తమ గుండెలు బాదుకుంటూ, రోదిస్తూ పరుగెత్తుకుని వస్తున్నారు.

అతను ఓయింటిముందు నిలబడి, భగభగ మండుతున్న దూలంతట్టు చూస్తున్నాడు. ఇంతలో తనకు ఓపసిపాప రోదన స్వరం "అమ్మా" అన్న కేకలూ వినిపించాయి. తన ఆలోచనలన్నీ చిన్నాభిన్నమైపోయాయి. ఇంతలో ఓస్త్రీ "అయ్యా నాబిడ్డ! అమ్మ నాబిడ్డ! కాలిపోతూంది! రక్షించండి బాబూ" అని గుండెలు బాదుకుంటున్నాది.

ఆమే! ఆ నాడు తనను నానామాటలుఅన్న ఆ పసిపాపతల్లి! తన హృదయం తల్లడిల్లిపోయింది. ఆమె చూపుతున్న యింటితట్టు చూచాడు.

అప్పటికే ఆమె యిల్లు తాటాకులు పూర్తిగా కాలి మండుతున్నాయి. ఇంకొక రెండు నిముషాలలో అంతా కూలి లోపల రోదిస్తున్న పసిపాప మీద కూలిపోగలదు. ఆయింటి ద్వారం భగభగా మండుతోంది. కాని లోపల ఆ పసిపాప యెలా నిలువగలిగిందో అతని కర్థంగాలేదు. అతని ఆలోచనలు పరిపరివిధాలపోయాయి.

కాలిపోతున్న తన బిడ్డను రక్షించుకోడానికి ఆమె ఆ అగ్నిలో దేనికి జొరబడదు?

నిజమే! కన్నతల్లిగూడా తన బిడ్డ అపాయంలో చిక్కుకునివున్నదంటే, ఆ బిడ్డస్థితిచూచి రోదిస్తుంది; గుండె బాదుకుంటుంది; యెన్నో దీనాలాపాలాడుతుందేకానీ, తన ప్రాణం పోవడానికిమట్టుకు వప్పుకోదు.

ఇక ఆలోచిస్తే లాభంలేదనుకున్నాడతను. అసలే కాలం మించిపోయింది. ఇక ఆశాభంగంగూడా

కాగలదు. ఆ నిప్పులలో దుమికాడా కుష్ఠురోగి. లోపల యేమగుపించడంలేదు. పొగ తో తన కండ్లు మంటలెత్తుతున్నాయి. కాని ఆ పసిపాప అరుపులవలన ఆ ప్రాంతానికి చేరగలిగాడు. ఇక క్షణ కాలంలో యిల్లంతాకూలి, దూలాలు వారిని కప్పివేయగలవు.

ఆ పసిపాపను తన హృదయానికదిమి తన రెక్కలతో అదిమిపెట్టాడు. కళ్లు చీకట్లు క్రమ్మాయి. ఇంటిలోనివస్తువులు తను తీసుకరాలేదు. అతను ఓ బండను తట్టుకొని బోర్లపడ్డాడు. సగంకాలిన ఓ దూలం తన వీపుమీదపడింది. తను లేవలేక పోయాడు. వీపుకాలిపోతూంది. మెల్లగా ప్రాకుతుంటూ వచ్చాడు. తన అడుగునవున్న పసిపాపను మాత్రం వదలలేదు. తన శరీరంమీదిగుడ్డ కాలిపోతున్నాది. తన తొడలన్నీ శగకు మండిపోతున్నాయి.

తేను మెల్లగాలేచాడు. తన కాళ్లన్నీ బొబ్బలెక్కాయి. తన వొళ్ళంతా మాడిపోయింది. ఆ పసిపాప చేతులు, మొహం కొద్దికొద్దిగా బొబ్బలెక్కాయి. తను యిక ఆ పసిపాపను పట్టుకోలేకుండావున్నాడు. తన దేహం తేలిపోయింది. కళ్లు పూర్తిగా అగుపించడంలేదు. ద్వారం దగ్గరకు వచ్చాడు. అది దాటితే తను బయటపడ్డాడు. పడిపోతున్న అతను ఆ ద్వారానికి అనుకున్నాడు. చర్మం బయటబడ్డ తన దేహం మరీ కాలింది. బయట మూగిన జనం అతన్నిచూచి, నలుగురుచేరి ఆ పసిపాపతోగూడ బయటకు లాగివేశారు.

వీధిలో రోదిస్తున్న తల్లి తన బిడ్డను జవురుకుంది. అతన్నిచూచి ఆశ్చర్యపోయింది. ఒకప్పుడు ఆ కుష్ఠురోగిని తనెన్నో మాటలంది. అతనేతన పసికందు ప్రాణాలు, తన ప్రాణాలు కాపాడాడు యీనాడు.

ఆ కుష్ఠురోగిని తీసుకపోయి అతని మండపంలో ఆ బండలమీదనే పరుండబెట్టారా కఠినాత్ములు. వారి దృష్టిలో ఇంకా అతను కఠినాత్ముడే! దొంగ! నీచుడే! తుచ్ఛుడే! వారికి అతని హృదయ సౌకుమార్యం ఎవరికీ తెలియదు.

అతని దేహమంతా బొబ్బలతో కాలిన గుర్తులతో నిండివుంది. ఆ రాత్రంతా అతను ఆ మండపం మీదనే స్పృహతప్పిపడివున్నాడు. ఆ పసికందు తల్లి అతని ప్రక్కన కూర్చుని దేవునికి మ్రొక్కుకుంటున్నాది. ఆమె మనసులో అతను ప్రాణదాత; పుణ్యమూర్తి; శరీరానికి కుష్ఠున్నా మనసు పవిత్రమైనది, దయార్ద్రమైనది.

మెల్లగా తెల్లవారింది. అతను మెల్లగా కదిలాడు. అతనితల అతని చింకిగుడ్డలమీదవుంది. మెల్లగా తూర్పున అరుణరేఖలు ప్రసరించాయి. ఆ కాంతిలో అతని జీవుడు గగనపథాన్ని దాటిపోయాడు. అతని తల ఆ చింకిగుడ్డలమీదనుండి జరిగింది. వాటినుండి తను దాచిన చెక్కబండి బయటపడింది.

సమాజానికొక సామాన్య మానవుడతను. కాని ఆ తల్లి హృదయంలో అతనొక పూజనీయుడు, పుణ్యమూర్తి. అతని ఆత్మ శాంతికి ఆమె ఒక్కతే ప్రార్థించింది. కాని సమాజంలోని సభ్యుల హృదయాలు యెప్పటిమాదిరిగానే వున్నాయి. వారివింకా మారని మనసులే!

---

"ఎందుకురా నీబోటి లావుపాటివాళ్లంతా చాలమంచివాళ్లలాగను, నెమ్మదైన వాళ్లుగాను కనుపిస్తుంటారు"

"అది తప్పనిసరి కాబట్టి! - మేము యితరులతో గుద్దులాడలేము; ఎవరైనా కొట్టవస్తే పరుగెత్తలేము

---




## 'నారపీచు'

ఈ మధ్య ఢిల్లీ నగరంలో కొన్ని వందలమంది స్త్రీలు సినిమాలవినీతిదాయకములనియు, వానిని నిర్మూలించవలసియున్నదనియు పండిత నెహ్రూకు విజ్ఞప్తి సమర్పించుకున్నారు. దీనిని శ్రీ నెహ్రూగారు ఏ ధోరణిలో తీసుకున్నారో తెలియదు కాని కళావికాసంకంటె సినిమారంగంలో యీ నాడు అవినీతి చెప్పనలవికానంత పెరిగిపోతున్నది.

ప్రస్తుత చలనచిత్రరంగం ఉత్తమ ఆదర్శ లక్ష్యాలకు దూరంగానున్నదనడం పొరబాటుకాదేమో! తాము నిర్మించే చిత్రాలు ప్రజోపయుక్తములయి నైతికస్థాయిని పెంపొందజేయుచు, విద్య విజ్ఞానముల వ్యాప్తికి, ప్రజలలో నిస్పృహ, నిరాశలనుపోగొట్టి ఆనందోత్సాహముల ప్రోత్సాహానికి దోహదం కావడం వాంఛనీయము.

♦ ♦ ♦

మన ఆంధ్ర రాష్ట్రంలో యింతకాలంనుండి చాటుమాటుగా జరుగుతున్న కల్లు, సారాయి తయారీ, తప్పత్రాగి తందనాలు త్రొక్కడం బాహాటంగా నములులోనికి రావాలనే ఉద్దేశంతో మద్యనిషేధ చట్టాన్ని రద్దుచేయాలని కొన్ని రాజకీయ పార్టీలు సాగిస్తున్న ఉద్యమం అప్రతిష్టకే దారితీస్తున్నది.

మద్యనిషేధం మూలంగా సామాన్య ప్రజాశ్రేయోపురోభివృద్ధుల కవకాశముకలదని ఉద్దేశించబడింది. దానిని అర్థంచేసికొని స్వప్రయోజనాలకు వినియోగించుకోకపోవడం ఎవరిలోపం? పైగా త్రాగుడు కవకాశములు ఏర్పడాలని జరిగే యీ నాటి ఉద్యమము ప్రజా ఉద్యమము అనిపించుకుంటుందా? గీత పనివారల ఆర్థికస్థితిగతులు కల్లుగీత లేనందువలన విషమంగానున్నవనే ప్రచారం చాలవరకు సత్యదూరమైనది. ప్రభుత్వము తలపెట్టిన నీరా విధానం కొద్దిగానో, గొప్పగానోనున్న గీత కార్మికుల ఆర్థిక దుస్థితిని తొలగించడాని కుద్దేశించినప్పుడు సానుభూతితో పరిణామాలను, ఫలితాలను సదుద్దేశాలతో ఓర్పువహించి పరిశీలించడం ప్రతియొక్కరి ధర్మము.

మంచి చెడ్డలను ప్రజలు - ముఖ్యంగా స్త్రీలు గుర్తించి ప్రజా శ్రేయస్సును రూపొందించడంలో ప్రభుత్వమునకు సర్వసహాయముచేయాలి. ప్రజాహితానికి ప్రమాదకరమైన గీత పనివారల మద్యపాన నిషేధం రద్దుకు జరిగే ఉద్యమ స్వరూపాన్ని ప్రజలు యిప్పుడైనా తెలిసికోకలుగాలి!

♦ ♦ ♦

ప్రజారోగ్యంలో అభివృద్ధిరావాలంటే వైద్య సౌకర్యాలతోబాటు మంత్రసానులు, నర్సులసంఖ్య పెరగాలి. ఇంగ్లాండు దేశంలో జనాభా ననుసరించి ప్రతి 300 మందికి 1 నర్సు యున్నట్లును, అమెరికా బోటి దేశాలలో మరీ ఎక్కువమంది నర్సులున్నట్లు తెలుస్తున్నది. కాని మనదేశంలో ప్రతి 56000 మందికి 1 నర్సువంతున 7000 మంది యున్నారట. ప్రతి 100 ప్రసవములకు 1 మంత్రసానివంతున 100000 మంది అవసరముండగా మొత్తం 5000 మంది మంత్రసానులు మాత్రమే యున్నారట. అనగా ప్రతి 86000 కాన్పులకు ఒక మంత్రసాని అన్నమాట.

ఈ సందర్భమున వైద్యసదుపాయాల సమకూర్చే విషయంలో ప్రభుత్వము చూపుచున్న ఆసక్తి, శ్రద్ధ అధికము కావలసియున్నది. నర్సులకు, మంత్రసానుల శిక్షణకు వసతులు, అవకాశాలు విస్తృతంకావాలి. అందుకుగాను స్థానిక వైద్యశాలలలో తగుఏర్పాటులు చేసి నర్సులుగాను, మంత్రసానులుగా శిక్షణపొందుటకు, శిక్షణపొందినవారికి ఆకర్షణీయమైన ఉద్యోగ సదుపాయ, వసతులకు ప్రభుత్వము శ్రద్ధ వహించాలి.

ఇది మాత్రం చాలదు - ప్రజలలో నర్సులుగాను, మంత్రసానుల శిక్షణపొందడానికిగల ఏవగింపు నశించాలి. నిస్సహాయస్థితిలోనున్న వ్యాధిగ్రస్తులకు, కాన్పులుచేసి మాతా శిశు సంరక్షణకు తోడ్పడుట పరమార్థముతోకూడిన మానవసేవ. అవసరాన్నిబట్టి మానవసేవచేయడం పరమాత్మను సేవించడం వంటిది. ఇందులో అవమానమునకు గురికావడంకాని, వ్యక్తిత్వానికి భంగముకలుగుతుందని భయపడటంకాని పొరబాటు.

అన్ని ప్రధానావసరములతోబాటు ప్రజారోగ్యం కూడ దేశపురోభివృద్ధికి అత్యవసరం. దానిని నుద్దేశించి విశేషంగా మహిళలు నర్సులుగాను, మంత్రసానులుగాను శిక్షణపొంది ప్రజాహితానికి తోడ్పడాలి.

♦ ♦ ♦

వృక్షసంపద యభివృద్ధి మానవ నిత్యజీవితావసరాలకు ఎంత ముఖ్యమయిందో పశుసంపదకూడ అట్టిదే. కాబట్టే పశుపోషణకు మనదేశంలో ప్రాధాన్యత యివ్వబడింది; అంతేగాదు హిందూ కుటుంబాలు ఆరాధిస్తున్నవికూడాను.

ముఖ్యంగా ఆంధ్రదేశంలో గుంటూరుజిల్లాలోని ఒంగోలు ప్రాంత్యపు పశుసంపద జగత్ప్రసిద్ధి పొందింది. కాని పశుపోషణ మరింత క్రమబద్ధంగా జరిగినచో పశుసంపద మానవసమాజమునకు అత్యంత ఉపయుక్తము కాగలదు.

పుష్టికరమైనట్టియు, ఆరోగ్యకరమయినట్టి ఆహార సేకరణ, వానికనువైన స్థావరాల నిర్మాణం, అవసరమయిన వైద్యసహాయ సదుపాయాలు పశుసంపద అభివృద్ధిచెందుట కుపకరించగలవు. ఇందుకు వ్యక్తిగతమైన కృషికంటె సామాజికకృషి విశేషంగా దోహదమివ్వగలదు.

♦ ♦ ♦

స్థానిక సంస్థలకు ప్రజల దగ్గర అప్పుజేసే అవకాశముండడం, దానితో అభివృద్ధి ప్రణాళికల నిర్వహణకు ప్రభుత్వ ఆర్థిక సహాయముమీదనే ఆధారపడకుండా పూనుకోనడం మంచిదే! కాని స్థానిక సంస్థల పరిపాలనలోని అవకతవకలు, అసమర్థతలనుచూచి ప్రజానీకం స్థానిక సంస్థలకు ప్రజలు విరివిగా అప్పుయిస్తారా అనేది సందేహాస్పదము. ఇక ప్రభుత్వము ప్రజలు అప్పుగా యిచ్చిన దానికి హామీగానున్నచో స్థానిక సంస్థలతో సహకరించగలరేమో!

అయినా స్థానిక సంస్థల పరిపాలన పటిష్టంగాను, అభ్యుదయ మార్గంలో నుండాలంటే ప్రజాప్రతినిధులు విద్య, విజ్ఞానములుకలిగి, అనుభవపరులై, విశాల హృదయంతో పురోభివృద్ధిని ప్రోత్సహించేవారై యుండటం అవసరము. అట్టి వారిని స్థానిక సంస్థలకు ఎన్నుకోడం, ఎన్నుకోబడినవారు త్రికరణశుద్ధిగా కృషిచేస్తూ, పరస్పర సహకార సద్భావములతో పరిపాలనజరిగిననాడు దేశము బాగుపడుతుంది.

---

"ఏం అమ్మాయి! నీవు డబ్బునుచూచా ఒకడిని పెళ్లిచేసికునేది"

"అది కాదుకాని, నాభర్త డబ్బుగలవాడుగా నుండాలని - అలా కాకపోతే డబ్బులేనప్పుడల్లా కొరకొర్లాడుతూ విసుగుగానుంటాడు"

# విండర్ మియర్ సతి విసనకర్ర


రచయిత :
ఆస్కార్ వైల్డ్

అనువాదం :
సో. రామచంద్ర అగస్త్య ఎం. ఏ.


(గతసంచిక తరువాయి)

మి. ఏ:- చప్పుడుచేయకండి! నా వల్ల వీలైనంతవరకూ మిమ్మల్ని రక్షిస్తా. అయినా తరుణం మించిపోయింది! అదిగో! (కిటికీకి అడ్డంగాఉన్న తెరని చూపిస్తుంది) ఏమాత్రం వీలుచిక్కినా ఉడాయించండి!

విం.స:-మరి నువ్వో?

మి.ఏ:-అబ్బా, నావిషయం అలాగుండ నియ్యండి. నేను వాళ్లని ఎదుర్కోగలను.

[విండర్ మియర్ సతి తెరకి వెనకాల దాగుంటుంది]

అ.ప్ర:-(బయట) అదేమీ పనిచెయ్యదు. విండర్ మియర్, నువ్వు నన్ను విడిచి పెట్టడానికి వీలులేదు!

మి.ఏ:-అగస్టస్ ప్రభువా! అయితే ఇక నాకు సర్వనాశనం అయ్యిందన్న మాట! (తృటిమాత్రం ఆగి, నలు వైపులాచూచి 'ఆర్' ద్వారాన్ని చూస్తుంది. దానిగుండా నిష్క్రమిస్తుంది.)

[డార్లింగ్టన్ ప్రభువు, డంబీ, విండర్ మియర్ ప్రభువు, అగస్టస్ లార్టన్ ప్రభువు సిసిల్ గ్రహం ప్రవేశిస్తారు.]

డంబీ:-రెండుగంటలయ్యిందో లేదో అప్పుడే వెధవలు క్లబ్బు తలుపులు వేసేసేరు! (కుర్చీలో కూలబడతాడు) అసలు సాయంత్రం మజా ఇప్పుడే ప్రారంభమయ్యింది. (ఆవులిస్తూ, కళ్లు మూస్తాడు.)

విం.ప్ర:అగస్టస్ ప్రోద్బలంవల్ల మా బలవంతపు ఆతిథ్యాన్ని స్వీకరించడానికి మీరు సిద్ధపడడం మీ సౌజన్యాన్ని తెలియజేస్తుంది. డార్లింగ్టన్ ప్రభూ! అయితే నేను చాలాసేపు ఉండను.

డా.ప్ర:-అలాగా! మీరింత త్వరపడడం అంత బాగాలేదు. ఇదిగో ఈ చుట్టని అందుకోండి.

విం.ప్ర:-ధన్యవాదాలు (కూర్చుంటాడు)

అగస్టస్ ప్రభువు:- (విండర్ మియర్ ప్రభువుతో) ఏమోయి, ఇంటికి పోవాలని నువ్వు కలలోకూడా అనుకో

కూడదు. నేను నీతో మాట్లాడవలసిన సంగతులు చాలా ముఖ్యమైనవి ఎన్నో ఉన్నాయి (అతనితో 'ఎల్' టేబిల్ దగ్గిర కూర్చుంటాడు.)

సిసీల్ గ్రహాం:-ఓహో, మాకు తెలుసులే అదేమిటో? ఏది మాట్లాడినా మిసిస్ ఎర్లిని గురించేగా.

విం.ప్ర:-అయినా దానితో నీ కే మీ సంబంధం లేదుగా సిసీల్?

సిసీల్ గ్రహాం:-లేదులే. అందుచేతే అదంటే నాకంత ఉత్సాహం. ఎప్పుడూ నావిషయమే అంటే చీకాకుగా ఉంటుంది. అందుకనే ఇతరుల సంగతుల్ని గురించి అంత తహతహలాడతాను.

డా.ప్ర:-ఏమోయి, ఏమన్నా పుచ్చుకుందురుగాని, సిసీల్ విస్కీ సోడా పుచ్చుకుంటావా?

సిసీల్ గ్రహాం:-ధన్యవాదాలు (డార్లింగ్టన్ ప్రభువుతో టేబిల్ దగ్గరకి వెడతాడు) ఇవేళరాత్రి మిసిస్ ఎర్లిన్ బలే అందంగా కనిపించింది? అంతేనా?

డా.ప్ర:-నేను ఆవిడ భర్తణ్ణి కానులే.

సి.గ్ర:-నేనూ ఇదివరకు అలాగే అనుకునేవాడిని; కాని ఇప్పుడు కాక తప్పింది కాదు. కారణమేమిటో తెలుసా? కేరొలిన్ అత్తతో పరిచయం చెయ్యమని ఆవిడే నన్ను ఎంతో బలవంతం చేసింది. రేపు మధ్యాహ్నం భోజనానికి అక్కడికి వెడుతుందనుకుంటాను.

డా.ప్ర:-(ఆశ్చర్యంతో) నిజంగా?

సి.గ్ర:-అవును, నిజమే.

డా.ప్ర:-మీరంతా నన్ను క్షమించాలి. నేను రేపు వెళ్లిపోతున్నాను. నేను కొన్ని ఉత్తరాలు వ్రాయాలి.

[ఉత్తరాలు వ్రాసే బల్లదగ్గిరకి వెళ్లి కూర్చుంటాడు]

డంబీ:-మిసిస్ ఎర్లిన్ చాలా తెలివైందిలే.

సి.గ్ర:-ఏమోయి డంబీ! నువ్వు నిద్రపోతున్నావనుకున్నా.

డంబీ:-అవునులే, నాకది మామూలేగా!

అ.ప్ర:-చాలా తెలివైన మనిషి. నేనెంత వెర్రివెంగళాయినో ఆవిడికి బాగా తెలుసు-నాలాగే నాతత్వాన్ని అర్థం చేసుకోగలదు.

[సిసీల్ గ్రహాం అతనివైపు నవ్వుతూ వస్తాడు]

ఆహా, నువ్వు నవ్వితే నవ్వు, నాకేమీ భయంలేదు. నిన్ను పూర్తిగా అర్థం చేసుకోగలిగే స్త్రీని కలవడం చాలా అపూర్వమైన విషయం.

డంబీ:-అది చాలా ప్రమాదకరమైన విషయంలే. ఆ స్త్రీని పెళ్లాడటంతో అటువంటి సంఘటన పరిసమాప్తి అవుతుంది.

సి.గ్ర:-ఏమోయి టప్పీ, నువ్వామెని మళ్లా చూడవనుకున్నానే! అవును! నిన్న

మధ్యాహ్నం అలాగనే క్లబ్బులో చెప్పేవు. నువ్వేదో విన్నట్లు (అతనితో గుసగుసలాడతాడు.)

అ.ప్ర:-అదా, అసలు సంగతి ఆవిడ చెప్పిందిలే.

సి.గ్ర:-మిస్ జేడన్ సంగతో ?

అ.ప్ర:- దానినికూడా చెప్పింది.

డంబీ:-మరి ఆవిడసొత్తో ? ఎంత ఉందో చెప్పిందా ?

అ.ప్ర:-(గంభీర స్వరముతో) దానిని గురించి రేపు చెబుతానన్నది.

[సిసిల్ గ్రహాం 'సి' టేబిల్ దగ్గిరకి తిరిగి వెడతాడు]

డంబీ:-ఈ కాలపు స్త్రీలు వ్యాపారులాగ తయ్యారౌతున్నారు. మన నాయనమ్మలు యంత్రాలమీంద వాళ్లటోపీలు పడేస్తే వాళ్ల మనుమరాళ్లు విసనకర్ర లాగ గాలివీవగలిగే యంత్రాలమీాదే తమ టోపీల్ని పడేస్తారు.

అ.ప్ర:-నువ్వావిణ్ణి దుష్టురాలుగా చిత్రించదలిచేవు. కాని ఆవిడి ఎంత మాత్రమూ కాదుసుమా !

సి.గ్ర:-దుష్ట స్త్రీలు ఒకరికి బాధకలిగిస్తే, మంచి స్త్రీలు ఒకరికి చీకాకు కలిగిస్తారు. అంతే తేడా.

అ.ప్ర:-(చుట్టపీలుస్తూ) మిసిస్ ఎర్లినుకు మంచి భవిష్యత్తు ఉన్నది.

డంబీ:-మిసిస్ ఎర్లినుకు సంబంధించిన పూర్వగాథ కావలసినంత ఉంది.

అ.ప్ర:-పూర్వగాథలున్న స్త్రీలే నాకు నచ్చుతారు. వాళ్లతో మాట్లాడడం చాలా సరదాగా ఉంటుంది.

(సశేషము)

# ఆంధ్ర జానపద గేయవాఙ్మయ చరిత్ర

## కాంభోజరాజుకథ (క్రీ. పూ. అయిదవ శతాబ్దం)

శ్రీ టేకుమళ్ల కామేశ్వరరావు

(గతసంచిక తరువాయి)

### కొన్ని ఇతర పాత్రలు

మహారాజైన కాంభోజరాజు దైవభక్తిపరుడు. సంతానం లేకపోగా ఆత్మహత్యకు సిద్ధపడ్డాడు. కాని భగవంతుడు కరుణించి బిడ్డలనిచ్చేడు. ఆరాజు వ్రణ బాధతో అవస్థపడి చివరకి గెల్చేడు.

దేవతల పాత్రలు దేవతల పాత్రలే !

చిన్న పాత్రలు కూడ తమ కార్యములను చక్కగా నిర్వహించేయి. ఈమొత్తరుగా పాత్రపోషణ సమంజసంగా ఉంది.

### రసపోషణ

కాంభోజరాజు కథలోని ఒక ఘనత అద్భుత రసం. దీనిలోని అద్భుతాలు ఒకటికాదు రెండుకాదు. అద్భుతాలకు తోడు అతిశయోక్తులు. చెరబందిరాజు మాటవినగానె రాజుగారి వ్రణం సగం నెమ్మదించిందిట! నాగేంద్రుడు మారి మారి పాముయేడు! చెరసాలలోనె మాణిక్యాంబ దేవతల వరంవల్ల ప్రసవించింది!

దేవతలే ఆ బిడ్డణ్ణి పెంచేరు! మనిషి బంగారు బల్లిగా తయారయేడు ! నిర్మ్మలమందు మాట్లాడిందట ! చచ్చిపోయిన చెరబంది రాజు బతికేడు! సంహార కాల పుదుడ్డు, బంగారు పాదుకలు! కీలుగుర్రం ఎగురుతుంది! అట్టి చిత్రాలే బిసలు మంచం, బొమ్మల కుర్చీ! రాక్షసులు మాయలమారులు! ఇట్టి అద్భుతాలను చూసి పాఠకులు ముగ్ధులౌతారు!

కథాకల్పన చక్కగా ఉంది. పాత్రల ఆలోచనలు, ఉద్రేకాలు నిపుణంగా చిత్రించబడ్డాయి. బిడ్డలులేని రాజు ఎట్లు ప్రలాపిస్తున్నాడో -

అన్యాయకారుడు బ్రహ్మదేవుడయ్యా!
వాని గుడిలో నిప్పులు పొయ్యారో!
విష్ణుమూర్తి ఎక్కడున్నాడో!
వైకుంఠము రగిలిపోలేదో!
సాంబమూర్తి వాడేడ ఉన్నాడో!
కైలాసము రగిలిపోలేదో!

మాణిక్యదేవికి కోనేటిస్నానంలో నమ్మకంలేక.

'స్నానమందున చెమట పోతున్నది, లేసిభాగ్యము కలుగనే కలుగదు' అని అవిశ్వాసపూర్వకంగా అంది. అట్లే ఆమె విగ్రహాన్ని చూచి 'ఈనల్లరాయా సంతానాన్ని ఇస్తుంది?' అంది! పుష్పాలపాన్పుమీద పడి ప్రార్థిస్తుందట! ఈమొత్తరుగా ఆమె అపనమ్మకాన్ని కవి చక్కగా చిత్రించేడు.

ఉట్టి వర్ణనకోసమే వర్ణనలు ఈ గ్రంథంలో కనబడవు.

### వచనం

ఈ కథలో వచనం కొంచెంగానె ఉంది. దీని తర్వాత ఎప్పుడో రచించబడ్డ చిన్నమ్మకథలో వచనాలు దీర్ఘంగా ఉండి పాటసొగసుకి అడ్డు తగులుతున్నాయి.

వచనంలో కూడ కథ సాగిపోతుంది. అంతేకాని ముందు గేయంలో చెప్పబడినది వచనంలో తిరిగి చెప్పబడడంలేదు. ఇట్టి పద్ధతే చిన్నమ్మ కథ, బాల నాగమ్మకథ, బంగారు తిమ్మరాజుకథ మొదలైన వాటిలో అనుసరించబడింది. వచనం సులభం, అభ్యుదయ గ్రాంధికం.

## మాటలు జాతీయాలు

ఈ కిందిమాటలు, జాతీయాలు ఈ జంగంకథలో కనబడుతున్నాయి. అవుదా (అంబారీ, పుట 26) దాది (26), పణతి, ప్రాణాచారము (9) దాళి, దివాణం, నగరు, హుకుం, వీరముష్టి (14), ముత్యాల కుర్చీ (37), లాలలు పోయుట (నీళ్లుపోయుట), పొంతనాలు (15,) సాకట, మందులకావడి (16), అధికరించుట (అధికమగుట) కోడికట్టు (17), గవులు పుట్టుట (కంపు కొట్టుట) (18), లఘువు (చురుకుదనం) (19), చేబోడలు (20), మల్లబడ్డవ్రణం, పుడిసిళ్లు తీయుట? (22), పరాబు (24) సిఖా ఉంగరం (25) పోపిడి (విధము) 25, 31,), పన్నెండు కొప్పెరల ధనం (26) బిసలు మంచం (27) బొమ్మల కుర్చీ (28), సూక్ష్మపుచాప (35), పడుపుకాసులు (27), కొంగువేయుట (26), ముష్టిగింజలు మోయుట, బేటి (26), నిలువుకండ్లు పడి చూచుట (26), కళావంతులు, కరాటి (31), రవిక పీకీ (32), వెట్టి కొట్టాలు, బొక్కలో పెట్టుట (ఖైదుచేయుట) (38), పారజూచుట (32) మొదలైనవి.

## ముగింపు

పాటగాళ్ల నోళ్లలో పడి దీనిలోని భాష అనేక మార్పులు పొందింది. ఈ పాట ఛందో లక్షణం భిన్నంగా ఉంది. యతిమైత్రి కనబడదు. అచ్చు పుస్తకం నిండా తప్పులున్నాయి పీఠికతో మంచి కూర్పు అత్యవసరం.

విఖ్యాత బాధానివారిణి

నోపెయిన్ యొక్క

అసమాన శక్తిచే దాని ఖ్యాతి

విస్తరించుచున్నది




పెద్ద, చిన్న

ట్యూబులలో దొరకును

కలకత్తా

కెమికల్

కలకత్తా 29

నోపెయిన్

బాధలను మాన్పును

TEL-1A

---

Grams: "SELFHELP" Phone: 5516

# Nawa Bharat Agencies, Ltd.,

18, Audiappa Naick Street,
MADRAS-1.

*Stockists & Distributors for:*

LABORATORY AND HOSPITAL Glassware, Vaccine Phials and AMPOULES in AMBER, WHITE Neutral Glass, Pharmaceutical Bottles in AMBER, Blue and White Glass, Domestic Glassware of all descriptions.

*Represent*

**Reputed Manufacturers of India.**

---

శిలాజిత్ రసాయనం.

మధుమేహమును, మూత్ర వ్యాధుల నన్నిటిని నిర్మూలముగావించి ఆరోగ్యమునిచ్చు దివ్యామృతము.

40 రోజులకు సరిపడుమందు రు 10/లు.

## హంస

స్త్రీలపాలిట కల్పవృక్షము

స్త్రీలకు సంభవించు ఋతుసంబంధమయిన సమస్త వ్యాధులను, వంధ్యాదోషములను తొలగించి సంతాన ప్రాప్తి కలిగించు దివ్యామృతం.

40 దినములకు సరిపడుమందు రు 8/-లు

రావుసాహెబ్

యం. అప్పల నరసయ్య,

రిటైర్డు అసిస్టెంటు యింజనీరు

శ్రీ రామయోగి ఆశ్రమం

మహారాణిపేట పోస్టు, విశాఖపట్నం-2.




# లంబాడీ దయ్యం

శ్రీ పోలిశెట్టి నాగేశ్వరరావు

అప్పటికి నాకు చాలా చిన్నతనం. ఆ రోజుల్లో నాకు సినీమా చూడటమంటే బలేసర్దాగావుండేది. ఆవేళ సాయంత్రం నాకు సినీమాకు పోవాలనిపించింది. వెంటనే మా అమ్మదగ్గరకుపోయి డబ్బు అడిగాను.

మా అమ్మ కొంత సేపు ఆలోచించి "తిరిగి వచ్చేటప్పుడు చీకటిలో జడుస్తావేమోరా'' అంది.

"ఫర్వాలేదమ్మా, రోడ్డుమీద జనం నడుస్తుంటారుగా - వాళ్లతో కలిసివస్తా'' అన్నాను.

''అయితేసరే; పెట్టెతాళంతీసి డబ్బు తీసుకో'' అని మా అమ్మ నాచేతికి పెద్ద తాళాలగుత్తి యిచ్చింది. అప్పటికే ఆట ప్రారంభించే వేళయింది. అందుచేత తొందరగా, పెట్టె తాళంతీసి, డబ్బు తీసుకుని కంగారుగా సినీమాకు పరుగెత్తాను. సినీమా చూచినతర్వాత బయటకు వచ్చేశాను.

బయట చాలా చీకటిగావుంది. చలి గాలి బాగావీస్తూవుంది. ఆకాశమంతా మేఘాలతో నిండివుంది. చినుకులు చిటపట రాలుతున్నాయి. ఆలస్యంచేస్తే వర్షం ఎక్కువవుతుందని యింటికి గబగబ బయలుదేరాను. కాని యింటికి సరిగ్గా సగం దూరంవచ్చేసరికి వర్షం పెద్దదయింది.

వర్షంరావటంవల్ల రోడ్డుమీద జనం ఎవరిదారినవారు పారిపోయారు. నేను మాత్రం ఒంటరిగా అక్కడవుండిపోయాను. దగ్గరలో ఎక్కడా యిళ్ళుకూడాలేవు. రోడ్డు ప్రక్కన ఒకపాడుపడిన గుడి వుంటే, అందులోకి పోయి తలదాచుకున్నాను.

నా చుట్టూ నిర్మానుష్యంగా వుంది. కాటుకలాంటి చీకటి అంతటా ఆవరించి వుంది. వర్షం జోరుగా కురుస్తూవుంది. పొలాల్లో నక్కలు అరుస్తున్నాయి. కాలవలో కప్పలు బెకబెక మంటున్నాయి. నాకు చాల భయంవేసింది.

పైగా ఆ మధ్య అక్కడొక విషాధ సంఘటన జరిగింది. నేను నిల్చున్న పాడు గుడి ప్రక్కనే ఒక పెద్దచింత చెట్టువుంది,

దాన్ని రాత్రుళ్లు చూస్తే జుట్టువిరబోసుకు నిల్చున్న పెద్దదయ్యంలాగ కన్పిస్తుంది. సంవత్సరం క్రితం ఒకలంబాడీదండు ఎక్కడ నుంచోవచ్చి ఆ చెట్టుక్రింద మకాంవేసింది. ఆ దండులో ఒకలంబాడీది భర్తతో పోట్లాడి, ఆ కోపంతో పోయి ప్రక్కనున్న కాలవలో దూకి ఆత్మహత్య చేసుకుంది. అప్పటినుంచీ ఆ లంబాడీది దయ్యమై ఆ చింతచెట్టు తొర్రలో కూర్చుని, ఎవరైనా రాత్రిళ్లు ఒంటరిగా పోతుంటే పైనుంచి కొమ్మ వూపుతుండట. జడిశారా 'గల్లు గల్లు' మంటూ శబ్దం చేస్తూ వారి వెంట పడుతుండట. ఈ సంగతి మావూళ్లో అందరికీ తెలుసు. ఆ సమయంలో యిదంతా జ్ఞాపకంవచ్చి భయంతో వణికిపోయాను.

వర్షం వెలిసేటప్పటికి అర్ధరాత్రయ్యింది. ఎవరైనా ఆ దారినవస్తారేమో కలిసి పోవచ్చుననుకున్నాను. కాని ఎంతసేపు వేచిచూచినా ఎవరూరాలేదు. ఇక ఒంటరిగా బయలుదేరక తప్పిందికాదు.

ధైర్యం తెచ్చుకుని రెండడుగులు ముందుకు వేశాను. వెంటనే నా వెనకాల 'గల్లు గల్లు'మని శబ్దం వినిపించింది. ఆగి పోయాను. నేను ఆగగానే ఆశబ్దంకూడా ఆగిపోయింది. మళ్లా నడిచిచూశాను. మళ్ళీ గలుగలుమని శబ్దంవినిపించింది. ఈసారి ఆ శబ్దం చాలా స్పష్టంగావిన్నాను. నాగుండె ఆగిపోయింది. జ్వరం వచ్చినట్లయింది.

ఇంకేం చెప్పమంటారు? లంబాడీ దయ్యం నన్ను తరుముకు వస్తూవుంది. భయంకరమైన దాని ఆకారం మనస్సులో వూహించుకుంటూ ముందుకి గబగబ నడుస్తున్నాను. అదికూడా నాఅంత వేగంగా గల్లుగల్లు మంటూ నడుస్తూవుంది. వెనక్కి తిరిగిచూద్దామనుకొన్నాను. కాని తిరిగి చూస్తే వీపుమీద చరుస్తుందని భయపడి వూరుకున్నాను.

నా ప్రాణాలమీద ఆశ వదలుకుని ఆ చీకటిలో అలాగే నడుస్తున్నాను. ఆ శబ్దం కూడా అలాగేవినిపిస్తూవుంది. నేను ఎక్కడికి పోతున్నానో నాకే తెలియటంలేదు. ఆఖరికి ఎట్లాగో మా యిల్లు చేరాను. గబగబ తలుపుతట్టాను. అమ్మ తలుపుతీసింది. నన్ను చూచి ఎందుకురా అలావణికి పోతున్నావంది.

"దయ్యం తరుముకొస్తూవుందమ్మా... లోపలికి పద" అన్నాను కంగారుగా.

"ఏం దెయ్యంరా?" అంది అనుమానంగా చూస్తూ.

"అదేనమ్మా...ఆ గుడి దగ్గరి లంబాడీ దెయ్యం"

"ఏంజేసింది?"

"తరుముకొచ్చింది"

"నువ్వు చూశావా?"

"ఇంకా చూసేదేమిటి? గల్లు గల్లు

మంటూ నా వెనక పడితేను. ఆ శబ్దం బాగా విన్నానుకూడా''

"అలాగా'' అంటూ, మా అమ్మ నా వంక ఏదో ఆలోచిస్తూ కొంతసేపు చూచింది. మా అమ్మ చాలా తెలివిగలది ఆ దెయ్యంసంగతి క్షణంలో కనిపెట్టేసింది.

"నేను యిందాక యిచ్చిన తాళం గుత్తి మొలలో తగిలించుకుని దెయ్యం, దేవారా అంటున్నావా?'' అంది మా అమ్మ.

తడిమి చూచుకుంటే తాళం గుత్తి నా మొలలోనేవుంది. సినీమాకు వెళ్లే కంగారులో ఎప్పుడు మొలలో దోపుకున్నానో నాకు గుర్తులేదు.

"నీ తస్సాదియ్యా నన్ను ఎంత జడిపించావే'' అని తాళంగుత్తి నేలకేసి కొట్టాను. అది లంబాడీ దెయ్యంలాగ గల్లుమంది. నా అనుమానం తీరిపోయింది.

అమ్మా, నేనూ చాలాసేపు నవ్వుకున్నాం.

---

# మూడు విగ్రహాలు

### శ్రీ గంధం రంగయ్య

మంత్రి తిమ్మరుసు కృష్ణదేవరాయలి ఆస్థానములో ఉండేవాడు. తిమ్మరుసు ధీశాలి, విజ్ఞాన సంపన్నుడు. కృష్ణదేవరాయలు తన మంత్రి విజ్ఞానమును ప్రజలందరికీ తెలుపుదామని ఒక యుక్తి పన్నాడు.

శిల్పిని పిలిపించి ఒకే ఆకారముగల మూడు విగ్రహాలు చేయించాడు. ఒకటికంటే ఒకటి బాగున్నాయి. తిమ్మరుసును పిలిపించి "మంత్రీ! ఈ మూడు విగ్రహాల్లో యే విగ్రహము మంచిదో చెప్పు'' మన్నాడు. తిమ్మరుసు యెప్పుడూ యేపనీ చేయననేవాడుకాదు. అందుచేత సరేనని, ఒక రోజు గడువడిగాడు.

మూడు విగ్రహాల్ని ఒక గదిలోనికి తీసుకువెళ్ళి ఒక బల్లమీద పెట్టాడు మంత్రి. ఒక సన్నటి యినుపతీగని పట్టుకొచ్చాడు. మూడు విగ్రహాల్ని ఆ తీగతో కొట్టిచూసాడు. మూడింటికి చెవుల దగ్గర గట్టిశబ్దమురాలేదు. ఒక విగ్రహాన్ని తీసికొని దాని చెవి పరీక్షించాడు. ఒక చిన్న రంధ్రము ఉంది ఈ తీగ దానిగుండా పోనిచ్చాడు. అది ఎటునుండి బైటికిరాలేదు. అంటే మరియొక రంధ్రము ఆ విగ్రహానికి లేదన్నమాట. ఇంతతో ఆ విగ్రహపరీక్ష పూర్తి అయింది.

రెండవ విగ్రహాన్ని తీసికొని దానికిగూడ చెవిలోనున్న రంధ్రముగుండా తీగనూర్చితే అది నోటిలోనున్న రంధ్రముద్వారా బయటికి వచ్చింది. తిమ్మరుసు "ఊహూ'' అనుకున్నాడు.

మూడో విగ్రహాన్ని తీసికొని దాని చెవిలోకూడ తీగదూర్చితే అది రెండో చెవిలోనున్న రంధ్రము ద్వారా బయటికి వచ్చింది. విగ్రహానికి ఆనవాలు పట్టుకున్నాడు.

మఱునాడు రాజుదగ్గఱకు వెళ్ళి తను మొదట పరీక్షించిన విగ్రహము మంచిదన్నాడు. కారణం చెప్పమన్నారు సభలో రాజుగారు. "మొదటి

విగ్రహం చెవిలోనుండి మరెక్కడికీ దారిలేదు. అంటే ఆరకం మనుషులు తాము విన్నది యెక్కడా చెప్పకుండా తమలోనే యిముడ్చుకుంటారు. రెండవ విగ్రహపు రకంవాళ్ళు తాము విన్నది దాచుకోలేక అందరికీ చెప్పుతారు. ఇకమూడవ విగ్రహపు రకం వాళ్ళు తాము విన్నది శుభ్రంగా మఱచిపోతారు. ఈ చెవిలో విని ఆ చెవిలో మరుస్తారు. తాము విన్నది గుట్టుగా ఉంచుకొనే మనుష్యులు మంచివారు. కనుక మొదటి విగ్రహం అన్నిటిలోకి మంచిది. అందానికి మూడు ఒక తీరుగానే ఉన్నాయి. పలుకడానికి నోటు మూడింటికిలేదు. శిల్పి చేసిన విధంలో చూస్తే మొదటి విగ్రహము మంచిదని తోస్తోంది. ఈ మూడు విగ్రహాలే మనుష్యులైతే మొదటి రకపు వారే మంచివారు." అని తిమ్మరుసు తన కారణం చెప్పి కూర్చున్నాడు. రాజుగారు తిమ్మరుసును చాలా అభినందించారు.

—o—

## వర్షాకాలము

శ్రీమతి జి. సత్యవతి

వచ్చెను వర్షాకాలము
వచ్చెను ఆకాశమునందు మేఘములపుడున్
వచ్చెను ఉరుములు, మెరుపులు
వచ్చెను చిరుజల్లులపుడు వేడ్కలుమీరగ.
ఎండలన్నియు మెల్లగా పోయినాయి
మబ్బులన్నియు చల్లగా వచ్చినాయి
చల్లచల్లని గాలులు వీచినాయి
జల్లు జల్లులు చక్కగా కురిసినాయి.
ఏరులన్ని చక్కగా నిండాయి
చంద్రకాంతలు చక్కగా పూసినాయి
చెల్లెలపుడు పూవులు కోసినాది
తమ్ములపుడు గాలిపటాలు వదలె.
కప్పలపుడు బెకబెకా ధ్వనులు చేసాయి
కీచురాయిలు కిచాకిచా అరువసాగె
రైతుబాబులు చక్కగా నాట్లువేసె
చూడముచ్చటగానుండె ప్రకృతియపుడు.
ఆకాశమున పెళాపెళా ధ్వనులువచ్చె
తూర్పున చూడగా ఇంద్రధనస్సువచ్చె
పిల్లలపుడు గంతులు వేసినారు
వర్షమపుడు గొప్పగా కురువసాగె!

—(o)—

## అంతా పెరుమాళ్ల కెరుక

'శ్రీ అర్జునుడు'

పూర్వం బొమ్మలపూడి అనే గ్రామంలో నాంచారయ్య అనే ఒక వైష్ణవుడుండేవాడు. అతనికి వివాహంకూడా జరిగింది. భార్య రంగమ్మ! ఆవిడ చాలా సాధ్వీ. భర్తనాంచారయ్య అంటే గౌరవం, భక్తి గలిగి అతి వినయంగా వుంటుండేది. భార్య రంగమ్మ తనకు ఉన్నదాంట్లోనే తనుతినగా మిగిలిన కొంచములో ఓ, యింత యితరులకు పెట్టాలని అతని సంకల్పం. కాని నాంచారయ్య ఏమంత వున్నవాడు కాదు. దనధాన్యాలు లేవు. భూమీ పుట్రా లేదు. నాంచారయ్యకు వున్నదల్లా ఒక్కటే! తనువున్న గ్రామంలో వున్న పిల్లలకు చదువుచెప్పి, ఊళ్లో ప్రజలు నలుగురూ యిచ్చే ఫలసాయంవల్ల పొట్టపోసుకుండడం.

పిల్లా జెల్లా లేరు కాబట్టి కుటుంబం ఏమంత ఒడి దుడుకులు లేకుండా సాఫీగానే గడిచిపోతూంది. భార్యకు, తనకూ ఏ అడ్డంకులూ లేవు; కాని వారికి పెద్దగా కష్టంవచ్చిందల్లా ఎక్కడంటే—నాంచారయ్య ప్రతివారినీ తన యింటికి ఆహ్వానించి భోజనంపెట్టే వాడు. వచ్చే సంపాదనకన్న అతిది సత్కారాలకు మహా ఎక్కువగా ఖర్చుచేసి సంతోషపడేవాడు.

ఒకరోజున నాంచారయ్య ఇంటికి వారి మతగురువు గారు వచ్చారు. గురువుగారి రాకకు చాలాసంతోషించి, పంచభక్ష్య పరమాన్నాలతోటి భోజనం పెట్టాడు నాంచారయ్య! ఈవిధంగా గౌరవించి విందుచేసినందుకు నాంచారయ్యను వేనోళ్ల పొగిడారు మతగురువుగారు. మాటల సందర్భంలో నాంచారయ్యే కుటుంబ సమాచారం అడిగారు గురువు. నాంచారయ్యకు పిల్ల జెల్లా లేనందుకు తన విచారాన్ని ప్రకటించి "అంతా పెరుమాళ్లదయ" అని సానుభూతి ప్రకటించాడు.

"బంగారం మొదలయిన వస్తువులమీద ప్రీతిని వదిలినపుడే మానవునికి మోక్షసాధన లభ్యమౌతుందని శిష్యునికి అదే సమయంలో గురువుగారు బోధించారు. కాని గురువుగారుమటుకు శిష్యులు ఇచ్చిన పారితోషికాలన్నింటిని చేర్చి 50 తులాల బంగారు విగ్రహాన్ని చేయించుకొని తనపూజా మంటపంలో పెట్టుకొని వుండేవాడు. గురువు ఎక్కడికి వెళ్లినా తనతోపాటు ఆపూజామంటపం తీసుకొని వెళ్లేవాడు.

గురువుగారికి 4, 5, దినాలు మస్తుగా అన్నీ అరగించే సరికి గురువుగారు ఇంకా అక్కడ కొన్నిదినాలు వుండుటకు నిశ్చయించుకొన్నాడు. ఇక్కడనుంచి గురువును ఏలాగైనా మకాంమార్చే విధంకోసం ఆలోచించడం మొదలుపెట్టాడు నాంచారయ్య.

ఇలాగ ఆలోచిస్తూన్న సమయంలో రంగమ్మ నాంచారయ్య దగ్గరకువచ్చి "ఏమండీ యిలాగ ఎంతకాలం గురువుగారిని మనం పోషించగలుగుతాము. ఏదోవిధంగా యిక్కడనుంచి మకాం మార్చేలా ప్రయత్నించాలి" అంటూ భర్తను ఉద్దేశించి అన్నది.

"అదే నేనుగూడ ఆలోచిస్తూన్నాను గురువు గారిని యిక్కడనుంచి నెమ్మదిగా మకాం మార్పించడం ఎలాగా" అని అన్నాడు నాంచారయ్య భార్యతో.

"అయితే ఒకపని చేయకూడదటండీ. స్వామీ! మేము ఇంక మిమ్మ భరించలేము మీరు యిక్కడ నుంచి మకాం మార్చడం మంచిదని" అని రంగమ్మ చెప్పింది.

"మంచి సలహా చెప్పేవులే, వారిదగ్గరకువెళ్లి నేను భరించలేనని చెప్పమంటావా! ఎంతపరువుతక్కువ! ఏదన్నా డబ్బుచిక్కే విషయం చెప్పకుండా వట్టి చచ్చుసలహా యిచ్చావు" అన్నాడు నాంచారయ్య.

"అయితే యీలాగండి చెబుతా మీగురువు గారి పూజామంటపంలో ఏంటో బంగారువిగ్రహం వుందండి" అని రహస్యంగా చెవిలో సలహాయిచ్చి- నాంచారయ్య దృష్టికి ఆవిగ్రహాన్ని తీసుకువచ్చింది రంగమ్మ.

అందుకు నాంచారయ్య సంతోషంతో భార్య సలహావిని కిక్కురుమనకుండా వూరుకున్నాడు.

నాంచారయ్య ఎప్పటిలాగే సకలభోగాలతోటీ గురువుగారిని సత్కరించడం మానకుండా చేస్తూ వచ్చాడు!

ఇలా కొన్నిరోజులు గడువగా ఒకనాడు అనుమానం తట్టింది గురువుగారికి! "చాలా బీదవాడైన శిష్యుడు నాంచారయ్య యింతగొప్పగా, పెద్ద ఆదరణతో నాకు ఈ సత్కారాలు ఎలా చేయగలుగుతున్నాడా" అని

మరుసటిదినం నాంచారయ్యను దగ్గరగాపిలిచి "నాంచారయ్యా నువ్వు ఏమంత భాగ్యవంతుడవు కావు! మరి యింత గొప్పగా ఇన్నిరోజులనుంచి

ఈ సదుపాయాలన్ని ఏలా నాకు చేయగలుగుతున్నా" వని ప్రశ్నించారు.

"దానికి సమాధానంగా నాంచారయ్య "ఏమని చెప్పమంటారు గురూజీ!" అన్నాడు!

ఈ విధంగా రెండు నెలలు నాంచారయ్య యింట్లోనే గురువుగారు గడిపివెళ్లారు.

ఒకరోజు ఉదయం గురువుగారు తన పూజా విగ్రహాన్ని, తీసి శుభ్రపరచాలని యివతలకు తీసేడు. తీరాచూస్తే 50 తులాల బరువుగలిగిన ఆ బంగారు విగ్రహం కాస్తా బెండువలె అతితేలికగా అయిపోయి వుంది. మొత్తం అంతా తూస్తే 5 తులాలు బంగారం వుందట.

ఈ విధంగా బంగారం హరించిపోయేటప్పటికి గురువుగారికి ఆశ్చర్యం, బాధ కలిగింది. శిష్యుడు నాంచారయ్య ఈ పనిచేసి వుంటాడని, ఆ బంగారంతోటి తనను యిన్నిదినాలు సంతృప్తిగా పోషించాడని గ్రహించి - శిష్యుడు చేసినపనికి చాలా బాధపడ్డాడు; చేయునదిలేక దొంగకు తేలుకుట్టినట్లుగా వూరుకొన్నాడు. ఇక యిక్కడ వుండడం వలను పడదని గ్రహించి, మరుదినం శిష్యుని ఆశీర్వదించి అక్కడనుంచి మకాం మార్చేశాడు గురువు.

అప్పటినుండి గురువు బంగారంలాంటి వస్తువుల మీద మమకారం వదిలేసుకొని మోక్షం పొందాడు.

నాంచారయ్య గురువుబాధను వదలించుకొన్నందుకు, తన్నుతాను పొగడుకొని భార్యనుకూడా కొంచం పొగిడాడు. ఆమె "అంతా పెరుమాళ్లకెరుక" అంటూ హేళనచేసింది.

ఇక నాంచారయ్య వాళ్లయింటికి, గురువు స్వర్గానికి, కథ కంచికి-మనంయింటికి పోదాం!

# సిరిసిరి మువ్వలు

శ్రీ సి. ఎ. సురేష్

ఒకయువతి బ్యాంకిలో క్యాషియర్ ఉద్యోగం యియ్యమని అడుగడానికి వెళ్లింది. మేనేజరు "ఈ ఉద్యోగానికిగాను నీకు గలయోగ్యత లేమిటి చెప్పమ్మా" అని అడిగాడు.

"మరేమికాదండి – నాకు డబ్బు దగ్గరుంచుకోవాలన్నా, వాడాలన్నా మహాసరదా" అన్నది.

♦ ♦ ♦

ఉద్యోగానికివచ్చిన ఒక అమ్మాయితో "అనుభవములేకపోయినా నీవు స్త్రీవైనంత మాత్రాన పెద్ద జీతం ఎలాగిస్తారమ్మా" అని మేనేజరు అన్నాడు.

"పొరబడుతున్నారు. అనుభవములేకపోవడము మూలంగా మీ రిచ్చే ఉద్యోగంచేయడం మరీకష్టమనేది మీరింకా గుర్తించనట్లున్నది."

♦ ♦ ♦

ఒక క్లాసులో పంతులు పుణ్యక్షేత్రాలను గురించిచెప్తూ "వాసూ! పూరీలోనున్నదేమిటిరా" అని అడిగాడు.

గభాలునలేచి నిలబడి "బంగాళాదుంపల కూరండీ" అన్నాడు వాసు.

♦ ♦ ♦

"డాక్టరుగారు లోపలున్నారండీ"

"వారుపోయి రెండు నెలలు కావస్తున్నది"

"వారు మరల ఎప్పుడు వస్తారనేది మీకేమైనా తెలుసా"

"క్షమించండి – వారు పోయింది పరలోకానికి."

# కథా జ్యోతి

శ్రీ రాయసం సుందర వెంకటరమణ

మానవుడి ఆలోచనా శక్తి, నటనా చాతుర్యము అత్యద్భుతము. ఎవేవో ఊహాలతో జీవితాన్ని ఉత్సాహంగా చేసుకొంటారు కొందరు మహానుభావులు. అన్నీ వున్నా అర్థంలేని ఆవేశాలతో ఆశయాలతో జీవితాన్ని అంధకారం చేసుకొంటారు మరికొందరు. నిర్మలంగా, నిశ్చలంగా వున్న నీలాకాశం తనకోసమై నిర్మింపబడిందనుకొంటాడు మానవుడు మాహాలోకంలో. మలయమారుతం తనకోసమై తన సుఖంకోసమై పంపబడిందని గర్వపడతాడు. తెరమీద బొమ్మవున్న కొద్ది కాలంలో ఎంత ప్రకాశవంతంగా, దేదీప్యమానంగా కనపడ ప్రయత్నిస్తుందో మానవుని జీవితాన్ని అంత సుఖ ప్రదంగా చేసుకోవలెననుకొంటాడు; ఆ ప్రయత్నంలో ఎంత నీచానికైనా పాల్పడ్తాడు. అది మానవుని జీవిత రహస్యము. జీవితమంటె కేవలం ఒకానొక వ్యక్తి నిజస్వభావము తెలుసుకోడానికి నిర్మింపబడ్డ రంగస్థలమని కొందరి ఊహ. ఒక్క నిరాశలో జీవితాన్ని అతఃపాతాళానికి తొక్కోవడం వెఱ్ఱితనం. కొందరు జరిగిన విషయాలు సంఘటనలతోనే క్రుంగిపోతారు. మఱికొందరు ఆ బాధను తోడి మానవసోదరులతో చెప్పుకొని హృదయక్షోభ తగ్గించుకొంటారు. కొందరు సోదరభావమును పెంపొందించుచు, అందరి యందును తన యందును వున్న ఆత్మలపోల్చిచూచుకొని ఆనందించుచుందురు. అదే సర్వమానవ సాభ్రాతుత్వములోని సారాంశము. అట్టి అనేకులలో నేనొకడను. దయయుంచి "ఎవరు నీవు" యని యడగరనుకుంటా మా పాఠక మహాశయులు. ఈ కథకు సంబంధించి విజయ శేఖర్ మిత్రుణ్ణి.

౧

రెండు సంవత్సరాల క్రితం వేసవి రోహిణికార్తె దినాలలో ఒక సాయంకాలం జరిగిన విషయం. నేను శేఖర్ జ్యోతి కేఫ్‌లో కాఫీతాగి సంతకు పోయ్యాం. రకరకాలదుకాణాలన్ని దాటుకొని ఒక చిన్న పూలకొట్టుకు చేరాం. మీరు యీ పాటికే నవ్వుకుంటున్నారుకదూ! సంతకు పొయ్యేవాళ్లు – అందులో మాలాంటి మాడరన్ యువకులు – నవయువకులు సంతకుపోతే చూడవలసినవి యేమిలేకనా! ఆపూలకొట్టుకు పోవడంలో ఉద్దేశ్యమేమిటి

యని ఆలోచిస్తుంటారు. మేము ఆ కొట్టుకు పోకుండా యుంటె నేను యీ కథ వ్రాసే అవకాశంలేక పొయ్యేది. ఆ పూలకొట్టుకు కొంత దూరంలో నిలబడ్డాం. ఆ కొట్టులో యిరువది సంవత్సరాలకు మించని యువతి కూర్చొని యుంది. ఎందరో పూలుకొనడానికి వచ్చారు. కొంటున్నారు. ముఖములో స్వేద బిందువులు - అలసట కనపడుతున్నా లెక్క చెయ్యకుండా పూలనిచ్చిడబ్బుతీసుకొంటున్నది. "ఏం శేఖర్ మామూలు ప్రకారంగా పూలనన్నిటిని కొనేసేయి డబ్బిచ్చి పోదాం,ఆలోచనెందుకు యింకా. నాకు అర్థంకావడంలేదు. నీవు అలా చేయడంలో అభిప్రాయము" అన్నాను నేను. "రమణా నీవునన్ను యిలా అపార్థం చేసుకుంటావని నేనెప్పుడు అనుకోలేదు. ఆమె ముఖం చూస్తే అర్థంకాని ఆవేదన, యేదో జాలి బయలుదేరుతాయి నాలో. అదేమో పూర్వజన్మసంబంధం కాబోలు! నేను దివ్యజ్ఞానసమాజానికి సంబంధించిన పుస్తకాల్లో చదివినప్పుడర్థంకాలేదు. ఇప్పుడది సత్యమని నిర్ధారణ చేసుకొన్నాను. ఈ దినం వాళ్లింటికి పోయి వాళ్లమ్మతో మాట్లాడాలి. అందకనే బండ్లో రాలేదు"అన్నాడు శేఖర్. అలాగే కానీ అన్నట్లు తలూపాను.

## 3

రెండు ఘంటలు గడిచింది మేము సంత దగ్గరికి పోయి యిప్పటికి. చెరొక సోడా సేవించి వీధిలోపడ్డాము. మేమిద్దరం ముందు, మాకు రెండు అడుగుల వెనుకగా చిన్న పూలకొట్లో చూచినయువతి 'కళ జ్యోతి' నడుస్తున్నాము. "ఎన్ని సంవత్సరాలుగా పూలనమ్ముతున్నావు కళ" అని ప్రశ్నించాడు శేఖర్. 'పదిసంవత్సరాలుగా' అంది ముభావంగా. అంధకారంగా వున్న గుడిసెలోకి పోయింది. దీపం వెలిగించింది. "అమ్మా ఎవరో నీతో మాట్లాడడానికి వచ్చారు." అంది కళ. 50 ఏండ్లు పై బడ్డ స్త్రీ బయటికి వచ్చింది. 'అలాగనా అమ్మా! పాపము యెవరో పెద్ద మనుష్యులుగాయున్నారు. వాళ్లు కూర్చోడానికి మంచంకుక్కితప్ప యేముంది మనయింట్లో' అంది ముసలావిడ బాధవ్యక్తపరుస్తూ. "ఫరవాలేదులేండి ఇలా అరుగుమీద కూర్చుంటాము-పండు వెన్నెల్లో," అన్నా కవిత్వ ధోరణిలో. ఎదుటి అరుగుమీద ముసలావిడ కూర్చుంది. "కళ అమ్మా ప్రతిదినం మిగిలిపోయిన పూలన్ని వీళ్లేనే కొనేది. హృదయమిప్పి మాట్లాడుతారు, కనికరాన్ని కనపరుస్తారు, అందువల్లే వీళ్లతో మాట్లాడినంతసేపు బాధలను, మన నుండేస్థితిని మర్చిపోతాను" అంది.

(సశేషము)




**ఆంధ్రతరుణి : శ్రీ రాంపల్లి శ్రీరామచంద్రమూర్తి, పోడూరు, (వయా) పాలకొల్లు. వెల 0-4-0.**

పద్య సంపుటి. దీనిని శ్రీ పొట్టి శ్రీరాములుగారికి అంకితముచేస్తూ, వారి ముఖచిత్రంతో ప్రచురించారు.

ప్రప్రథమంలో ఆంధ్రమహిళాభ్యుదయాన్ని ప్రబోధిస్తూ, జోహార్లు, స్వాతంత్ర్యదీక్ష, విషాదాంధ్ర, గాంధీమహాత్మ, హరిజనా, మేఘుడా, ఉపాధ్యాయ, విరహిణివిలాపము, ధనమహిమ, అభిలాష, తెలుగుపండితుడా అనే శీర్షికలతో రచింపబడింది. భావరస పోషణలతో జరిగిన యీ రచన ప్రజాదరణ పొందగలదని మా విశ్వాసము.

**విదుల : కీ. శే. ఆకుండి వ్యాసమూర్తి శాస్త్రిలు. ప్రచురణకర్త : విదూషక విద్వాన్ ఆకుండి వెంకటశాస్త్రి, 17 గోవిందరాజస్వామి తేరువీధి, తిరుపతి. వెల 0-6-0.**

శ్రీమహాభారతమందలి ఉద్యోగపర్వములోని వీరాంగనగాధ. సంస్కృతాంధ్రములలో తమకుగల పాండిత్యముతో యీ చిన్నకథను పద్యరూపంగా శ్రీ శాస్త్రిలుగారు రచించడం ఉత్తమ ఆంధ్రవాఙ్మయాహారములో నొక పుష్పము వంటిది.

♦ ♦ ♦

'తిరువయ్యారులోని త్యాగరాజాశ్రమం' అనుచిన్న పుస్తకం మా కార్యాలయమునకు చేరినది. ఇందులో త్యాగరాజస్వామి సన్నిధి, సమాధి, ఏటేటా జరుగుచున్న ఆరాధనోత్సవాల వివరాలతోబాటు అచ్చట తన స్వార్జితమును సర్వస్వము ఆలయ వసతి గృహాల నిర్మాణమునకు, నిత్య నైవేద్య దీపారాధనలకని వెచ్చించిన విద్యాసుందరి బెంగుళూరు నాగరత్నముగారి దానధర్మాల వివరాలను వ్యక్తముచేయు విషయములుకలవు. ఇందులోనే తన జీవిత విధ్యుక్త ధర్మముగా భావించి ఏ ఆదర్శ లక్ష్యాలకొరకు యీ ధర్మసంస్థ నిర్వహణమునకు పూనుకొనెనో వానికొరకై ధర్మకర్తలు, కార్యకర్తలతోబాటు ప్రజానీకం సయితం పాటుపడి కృషిచేయవలసినదిగా కీ. శే. నాగరత్నంగారు విజ్ఞప్తిచేశారు.

**పూపపిందెలు : 'లవణం', పటమట, కృష్ణాజిల్లా. వెల 0-4-0.**

ఇందులో బాలలనుద్దేశించి వ్రాసిన గేయములుకలవు. పసిపాపలకు వినోదం, విజ్ఞానం కలిగించేందుకు వారి మనస్తత్వాన్ని అనుసరించి శ్రీ 'లవణం'గారు రచించి తెలుగుబాల రచయితల సంఘంద్వారా ప్రచురింపబడింది. పిల్లల పురోభివృద్ధికిగాను వారుచేయుచున్న వాఙ్మయసేవ అపారము. ఈ పాటలు చదువడానికి, పాడడానికి, ఆనందించడానికి, అభ్యుదయమార్గంలో భవిష్యత్ జీవితాన్ని రూపొందించుకోడానికి అనువైనవిగానున్నవి.

# సంపాదకీయములు

## ఆహార పదార్థాలకు నిలకడైన ధరలు

ఆహారోత్పత్తి — జనాభా పెరుగుదలనుగురించి డాక్టరు పంజాబ్‌రావు దేశముఖ్ గారు ఒకచోట ఉపన్యసిస్తూ మనదేశంలో జనాభా పెంపుదలకంటె ఆహారధాన్యాల ఉత్పత్తి వేగంగా సాగిపోగలదన్నారు. ఇదిచాల్గా సంతోషించవలసిన విషయము. వారు చెప్పినట్లు రైతులు రసాయనిక ఎరువులు విరివిగా వాడడం వలన, వ్యవసాయ పద్ధతులలో కొద్ది కొద్దిగా అమలులోనికి వస్తున్న అభ్యుదయకర మార్పులవలన, నూతన ప్రాజక్టులు, ఆనకట్టలులాంటి నీటివసతులు అమరుటవలన ఆహారధాన్యాల ఉత్పత్తి అధికమగుచుండవచ్చును.

కాని ఆహార వస్తువుల ధరలు మరీపడిపోయే పరిస్థితులలో ప్రభుత్వము ధరలను సరసస్థాయిలో నిల బెట్టడానికి చేయకలిగింది అంతగా నుండదని చెప్పడం తృప్తికరంగా లేదు.

ఈనాటి అవసరం ఏమిటంటే — ఆహారవస్తువుల ధరలు, జీవనప్రమాణము - యివి రెండూ ఒకటి ననుసరించి మరొకటి యుండాలి. ధరలు విపరీతంగా పెరిగిన రోజుల్లో ప్రజలు గగ్గోలు పెట్టారు. ధరలు మరీ పడిపోగలవేమోనని తమ నష్ట కష్టాలను ఊహించుకుంటూ రైతులుయీనాడు గగ్గోలు మొదలు పెట్టారు. ఈ రెంటిని దృష్టిలోనుంచుకొని ప్రభుత్వము ఆహారధాన్యాలధరలు సరసస్థాయిలోనుండి ప్రజావసరాలు గడుస్తూ, ఎవరూ నష్టపడకుండా యుండే విధానాన్ని, ప్రాణాళికలను రూపొందించి అమలు పరచాల.

## రవాణా ప్రయాణ సౌకర్యాలు

జాతీయ రవాణా వినియోగదార్ల సలహా సంఘంలో రైల్వే రవాణాశాఖమంత్రి శ్రీలాల్ బహదూరు శాస్త్రిగారు ఉపన్యసిస్తూ రైల్వేలు సరకుల రవాణా సౌకర్యాలను ఎక్కువ చేశాయనీ, పరిస్థితి లోగడకంటె చక్కబడిందని అన్నారు. దాంతోబాటు ప్రయాణీకుల సౌకర్యాల విషయంలోకూడ రైల్వే శాఖవారు శ్రద్ధవహించాలి. అంటే ముఖ్యంగా మూడవతరగతి ప్రయాణీకులు దూరప్రయాణము చేసే సందర్భమున వారికి వసతి సౌకర్యాలు అత్యవసరము. రైలుప్రయాణీకులు అధికసంఖ్యాకులు మూడవ తరగతివారు కాబట్టి వారికి సౌకర్యాల విషయంలో శ్రద్ధప్రధానమైనది. దానికితోడు రైలుపెట్టెలలో నిర్ణీత సంఖ్యకుమించి ఎక్కడం గలీజుచేయడం, రాత్రిళ్లయినా, పగలైనా నలుగురయిదుగురి వసతిని ఒకడే ఆక్రమించుకొని అసభ్యంగా వ్యవహరించడం లాంటివి మానుకొని సాధ్యమైనంత గరిష్టప్రయాణవసతులను ప్రయాణీకులే అమర్చుకోవాలి. ఇది గురుతరమైన బాధ్యత.



## శ్రీ జయనామ సం॥ర. భాద్రపద-ఆశ్వయుజ మాసములు

| | | | |
|---|---|---|---|
| 1954 సం॥ సెప్టెంబరు నెల | 16 | గు | చ 28.16 అశ్వ 11.21 రా 3.16 మహాభరణి |
| | 17 | శు | పం 21-44 భ 6.44 తిధిద్వయం |
| | 18 | శ | ష 15-22 కృ 2.13 రో 55.41 అమృతసిద్ధియోగం |
| | 19 | ఆ | స 9.26 మృ 54.19 దివ 10-56 భానుసప్తమి మధ్యాష్టమి |
| | 20 | సో | అ 4.8 ఏవ్యం 55.17 ఆర్ద్ర 51.36 ది 14.15 |
| | 21 | మం | ద 56.5 పున 49.56 దివ 20.41 |
| | 22 | బు | ఏకా 53.58 పుష్య 46-24 దివ 9.38 త్యా 3.58 స్మార్తైకాదశి |
| | 23 | గు | ద్వా 53.4 ఆశ్రే 50.6 ది 21.41 |
| | 24 | శు | త్ర 53-26 మ 52-2 ది 21-0 |
| | 25 | శ | చతు 54-48 పూఫ 55.5 ది 12-56 మహాలయం |
| | 26 | ఆ | ● అమా 57.31 ఉఫ 59.8 ది 14-11 మహాలయ అమావాస్య - |
| | | | **ఆశ్వయుజమాసము** |
| | 27 | సో | శుద్ధపాడ్యమి 60.10 హ 60.10 ది 21.53 శరన్నవరాత్రారంభం కలశస్థాపనం |
| | 28 | మం | పాడ్యమి 1.13 హ 4.18 ది 26.12 |
| | 29 | బు | విదియ 5.21 చి 9.51 ది 25.16 అమృతయోగం |
| | 30 | గు | తదియ 9.53 స్వా 15.45 రా 1.15 |
| 1954 సం॥ అక్టోబరు నెల | 1 | శు | చ 14.31 విశా 21.45 రా 2.54 |
| | 2 | శ | పం 18.59 అనూ 27.33 రా 13.5 వోన్యతిథిః |
| | 3 | ఆ | ష 23.3 జ్యే 32.56 రా 24.46 షష్టితిథిః |
| | 4 | సో | స 26.24 మూ 37-36 రా 3.31 దేవినవరాత్రవ్రతం |
| | 5 | మం | అ 28.51 పూషా 41.22 ది 3.0 దుర్గాష్టమి |
| | 6 | బు | న 30.13 ఉషా 44-3 ది 2.9 మహార్ణవమి కాళిపూజ |
| | 7 | గు | ద 30.22 శ్ర 45.31 రా 25.57 విజయదశమి |
| | 8 | శు | ఏ 29.16 ధ 45.56 త్యాజ్యాభావః |
| | 9 | శ | ద్వా 26.55 శ 44.47 ది 3.21 |
| | 10 | ఆ | త్ర 23.25 పూ.భా 42.45 త్రయోదశితిథిః |
| | 11 | సో | చతు 18.53 ఉభా 39-35 ది 5.23 తిధిద్వయం |
| | 12 | మం | ○ పౌర్ణమి 13-33 రే 35.46 ది 7.35 |
| | 13 | బు | బ.పాడ్యమి 7.34 అశ్వ 31.25 దివ 22.7 రా 24.13 |
| | 14 | గు | విదియ 1-12 ఏవ్యం 53-29 భర 26.50 రా 25.13 |
| | 15 | శు | చ 48-18 కృ 22.14 రా 30-9 |

Printed & Published by Dr. S. Seshagiri Rao at Lodhra Press, Kesari Kuteeram Ltd.
15, Westcott Road, Royapettah, Madras.
Founder : Dr. K. N. Kesari; Ag. Editor : C. C. Punniah.

# మహిళల ఆరోగ్య రక్షణకు

## లోధ్ర

### గర్భాశయరోగ నివారిణి

స్త్రీలకు గలుగు ఋతుశూల, బహిష్ఠ కాకుండుట, అకాలబహిష్ఠ, మైల జాస్తిగాను తక్కువగాను పోవుట, కుసుమరోగము, సంతానహీనత, రక్త హీనత, మలబద్ధము, సూతికావాతము, కీళ్లనొప్పులు, అరికాళ్లు అరచేతులు మంట మొదలగు స్త్రీ మర్మ వ్యాధులను కుదుర్చును.

**12 ఔ. రు. 4-4-0   6 ఔ. రు. 2-4-0**

## మాదీఫల రసాయనము

ఇది ముదిరిన మాదీఫలముల రసముతో తయారు చేయబడినది. గర్భిణిస్త్రీలకు కలుగు వాంతులకు (వేవిళ్లు) యిది సంజీవివంటిది. తలతిరుగుడు, వాంతులు, అరోచకము, అజీర్ణము, మలబద్ధకము, నిద్రలేమి మొదలగు జబ్బులకు వజ్రాయుధము. జ్వర వేగమును తగ్గించుటలో యీ రసాయనము పేరుపొందినది. ఇది తేనెవలెయుండి నోటికి రుచిగను యింపుగను నుండును.

3 ఔన్సుల బుడ్డి రు. 1-4-0

## గర్భరక్షక

స్త్రీలు బలహీనులగుటచేత గర్భము ధరించిన పిమ్మట పెక్కురుగ్మతల పాలగుచున్నారు. ముఖ్యముగ వీరలకు గర్భస్రావము, అకాలప్రసవము, అప్పుడప్పుడు కడుపునొప్పి, నడుమునొప్పి, రక్తహీనము, శరీరమందు నీరుచేరుట, బలహీనము, అలసట, ఆయాసము, అజీర్తి, మలబద్ధకము మొదలగు జబ్బులు కలుగుచున్నవి. ఈ 'గర్భరక్షక' సేవించిన పై జబ్బులు రాకుండుటయేగాక ప్రసవించువరకును శరీరము మంచి ఆరోగ్యస్థితి గలిగియుండి నిండుమాసములు గర్భము ధరించి సుఖముగ ప్రసవించెదరు.

3 ఔ॥ రు. 3-2-0   6 ఔ॥ రు. 5-8-0

## క్షీరబలా తైలం

స్త్రీలకు ఋతుస్రావ దోషముచే గల్గు వాత వ్యాధులు, పార్శ్వపు తలనొప్పులు, తలపోటు, గర్భ వాతము, శరీరము బలిసియుండుట, మూర్ఛ, అపస్మారవ్యాధులు, క్షయవ్యాధి, నరముల బలహీనత, యీ తైలముతో అభ్యంజన మొనర్చిన నివర్తించును.

6 ఔ॥ల బుడ్డి రు. 3-0-0

## సౌభాగ్య శొంఠి

### బాలింత లేహ్యము

ప్రసవానంతరమున స్త్రీలకు బాలింతకారమను ఒక ఘాటు ఔషధమును యిచ్చు ఆచారము మన దేశమున చిరకాలముగనున్నది. అయితే ఈ కారమును లెక్కలేనన్ని పచారిదుకాణపు సామానులతో తయారు చేసి యిచ్చుచున్నారు. ఇందు కలియువస్తువుల పరిమాణమును, పదార్థజ్ఞానమును పాటింపక మందును తయారు చేయుదురు. ఈ కారము వారికి వేడిచేసి అనేక రుగ్మతలు సంభవించుచున్నవి. ఈ సౌభాగ్య శొంఠిని వాడిన ఆరోగ్యము చెడక తల్లియు బిడ్డయు సుఖముగ నుండగలరు. తల్లికి సమృద్ధిగ పాలుపడును.

బుడ్డి రు. 2-0-0

## ప్రమేహాంతకం

### (తెల్లబట్టవ్యాధికి)

అనేక కారణములవలన స్త్రీలకు గర్భాశయము నుండి తెల్లటిద్రవము వెడలుచుండును. స్త్రీ జాతియందు యీజబ్బు సర్వసాధారణముగనుండును. పసిపిల్లలకుగూడ యీవ్యాధి సంభవించుచున్నది. చిరకాలముగ యీవ్యాధివల్ల బాధపడువారి గర్భాశయము పుండగును. అట్టివారికి మేహజ్వరము, దగ్గు, నిస్సత్తువ, సంతాన హీనత సంభవించును.

బుడ్డి రు. 4-0-0

## కేసరి కుటీరం లిమిటెడ్

**15, వెస్టుకాట్ రోడ్డు, రాయపేట, మద్రాసు 14**

**తెనుగుజిల్లాలకు, నైజాముకు ఏజంట్లు**

**శీతారాం జనరల్ స్టోర్సు, బెజవాడ - సికిందరాబాదు**

